శైవప్రచారిణీ గ్రంథమాల. ౨౯

సంపాదకులు.

కొడిమేల రాజలింగారాధ్యులు

# శివయోగ సారము

ద్వితీయ సంపుటము.







గ్రంథకర్త

కొలని యాది గణపతి దేవుడు

# శైవప్రచారిణీకార్యాలయమున
# వెలకు దొరకు గ్రంథములు

| | | గ్రంథమాల చందా దారులకు | ఇతరులకు |
|---|---|---|---|
| 1 | కాశీసారము | 0 1 3 | 0 2 0 |
| 2 | భద్రాయు రుపాఖ్యానము | 0 8 0 | 0 12 0 |
| 3 | విద్యాస్థానవినిర్ణయము | 0 8 0 | 0 12 0 |
| 4 | శైవసిద్ధాంత దర్శిని. | 1 4 0 | 1 8 0 |
| 5 | ఉపదేశకాండము | 3 0 0 | 3 8 0 |
| 6 | సరసహృదయానురంజనము | 1 8 0 | 2 0 0 |
| 7 | స్కాందమహాపురాణము సంభవకాండము సంస్కృతము తాత్పర్యము తోసహా | 3 0 0 | 3 8 0 |
| 8 | సంభవకాండము వచనము | 1 4 0 | 1 8 0 |
| 9 | సోమవార వ్రతకల్పము | 1 0 0 | 1 8 0 |
| 10 | సర్వమధురము | 1 0 0 | 1 0 0 |
| 11 | వీరభద్రాష్టోత్తరశతనామావళి | 0 3 0 | 0 4 0 |
| 12 | వీరభద్రస్తోత్రకదంబము | 0 8 0 | 0 12 0 |
| 13 | భక్తపాల శతకము | 0 1 3 | 0 2 0 |
| 14 | శరభాంక లింగశతకము | 0 3 0 | 0 4 0 |
| 15 | గీతగౌరీశకావ్యము | 0 8 0 | 0 8 0 |
| 16 | అగ్నిముఖము జయాదులు | 0 3 0 | 0 4 0 |
| 17 | విఘ్నేశ్వరపూజపుణ్యాహవాచనము. | 0 2 0 | 0 3 0 |
| 18 | శివయోగసారము 1 వ భాగము | 1 0 0 | 1 4 0 |
| 19 | " 2 వ భాగము. | 1 0 0 | 1 4 0 |

వలయువారు

శైవప్రచారిణీ వరంగల్ అని వ్రాయ వలయును.

శైవప్రచారిణీ గ్రంథమాల ౧౫

# శివయోగ సారము

రెండవ సంపుటము.

ఇది

బ్ర॥ శ్రీ॥ విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచే

తాత్పర్యము వ్రాయఁబడి,

బ్ర॥ శ్రీ॥ కొంజిమేల రాజలింగారాధ్యుల వారిచే

శైవప్రచారిణీ ముద్రాక్షరశాల యందు

ముద్రింపఁబడియె.

కాపీలు. ౧౦౦౦

1927

చందాదారులకు వెల 1-0-0

ఇతరులకు వెల 1-4-0

# రాజ పోషకులు.

1 బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ ఇజ్జతాసార్ రాజా కందుకూరి బాలసూర్య ప్రసాదరావు జమీందారుగారు. దేవిడి.

# శాశ్వతాభిమానులు.

1 మ॥ రా॥ కొమరవెల్లి కాశయ్యగారు. వరంగల్.
2 మ॥ రా॥ భూపతి రామయ్య గారు. వరంగల్.
3 మ॥ రా॥ భూపతి రత్నంగారు. వరంగల్.
4 మ॥ రా॥ నాగబండి కిష్టమల్లయ్య గారు. వరంగల్.
5 మ॥ రా॥ కొండూరి రామలింగం గారు. వరంగల్.
6 మ॥ రా॥ కుంచం సుబ్బయ్య నాగయ్యగారు. వరంగల్.

# శాశ్వత చందాదారులు.

1 బ్ర॥ శ్రీ॥ పశిపండితారాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు మట్టెవాడ.
2 బ్ర॥ ముడిగొండ రాజమాంబగారి మల్లయ్య అయ్యవార్లంగారు వరంగల్
3 బ్ర॥ శ్రీ॥ శివపేవుల వీరేశలింగారాధ్యులవారు వరంగల్.
4 మ॥ రా॥ అష్టైదన్నుగారి నారాయణ సింగుగారు వరంగల్.
5 మ॥ రా॥ పెద్ది వీరయ్యగారు మత్రిముచ్చాల
6 మ॥ రా॥ ములుగు కిష్టయ్యగారు సిద్దిపేట.
7 మ॥ రా॥ కొమరవెల్లి శివరాజంగారి అంతయ్య గారు. ”
8 మ॥ రా॥ భూపతి బుచ్చిరామయ్య గారు. ముల్క-నూరు

# విషయసూచిక

—— :*: ——

శివయోగ సారము — ఉత్తరభాగము — ద్వితీయాశ్వాసము.

విషయము — పుట

## విషయసూచిక.

విషయము — పుట



సమాప్తము.





శ్రీ రాజేశ్వరాయనమః

# శివయోగసారము

## ఉత్తర భాగము.

### ద్వితీయాశ్వాసము.





శ్రీకర శివయోగ జ్ఞా
నాకర మహనీయ మూర్తి యతులిత కీర్తి
స్వీకృత గురువైభవ య
స్వీకృత భవసంక నాఖ్య! శ్రీగురు వర్యా! ౧

తా. సర్వ సంపదల కాలవాలమగు శివయోగ జ్ఞాన మహిమచే సంసార సముద్రమును దాటి కీర్తిశాలివై వెలయుచు నాకనాధ్యుఁడవను పేరుచే ప్రకాశించుచున్న గురువర్యా!

ఆ. వె. శైవ యోగశాస్త్ర సారస ముచ్చయ
ప్రకరణముల యుక్తి భావములను
వెలుఁగు కవితఁ దేట తెలివిగ సభవ
దాజ్ఞ విన్నవింతు నవధరింపు. ౨

తా. మీయాజ్ఞచే [illegible] శివయోగ శాస్త్రము [illegible]

సులభముగ బోధించెద వినుండు.

## అరిషడ్వర్గ లక్షణము.

క. నెఱి వెలుపలి వైరుల నం
డఱ గెలిచిన నైన నదిప్రశ్లాఘా పాకంబే
తెఱంగున నైనను లోనిప
గఱ గెలుచుట యదివిరక్తి గరిమం బయ్యెన్. ౩

తా. బాహ్య శత్రువుల గెల్చుటది యొక గొప్ప కాదు. లోపలనున్న కామక్రోధ లోభ మోహమద మాత్సర్యములను అంతరంగశత్రువులను జయించవలెను.

క. కామము క్రోధము లోభము
వ్యామోహము మదము మత్సరా టోపంబుల్
నామదిఁ బ్రబలిన మహరి
స్తోమంబును వరుసఁ బాఱఁ ద్రోలఁగవలయున్. ౪

తా. మనంబునఁ బ్రబలియున్న కామక్రోధాదుల నారింటిని క్రమంబుగా జయింపవలెను.

వ. అవ్విధం బెట్టిదనిన. ౫
తా. ఆయరిషడ్వర్గ విజయ మెటులఁ జేయవలయు ననిన

## కామ స్వరూపము.

క. తొల్లిటి నిజకర్మ ఫలము
తెల్లం బావునకుఁ గోరఁడిగి నట్టియ్యెన్
ఎల్లవుడుఁ బొందియుండఁగ
నుల్లములో నెందు గోర్కు లుచితంబగునే. ౬

తా. ఆవునకు తోకయుండె నటులఁ బూర్వపూర్వ జన్మంబునఁ జేసినకర్మ ఫలానుభవమున నేగదా! యీదేహంబు ధరించినది. ఈవిషయము తెలిసియుఁ దనకు కోరికలఁ గోరుట యుచితమగునా?

తము గలుగుటను నజహరి
ప్రముఖుల పదవులును దుఃఖ । బహుళములు గదా. ౧౦

తా. ఈ రాజ్యములఁ గోరిన దేవతలకే సుఖములేదు. ఇంద్రాదులు స్వర్గాధిపత్యము వహించి తమకంటె బలవంతులగు రాక్షసులచేఁ బాధ నొంపఁ బడిరి ఇంద్రునికన్న గొప్పవాఁడు బ్రహ్మయు- బ్రహ్మకన్న గొప్పవాఁడు విష్ణువు నుండుట చేతను, స్వర్గముకంటె సత్యలోకము- సత్యలోకముకంటె వైకుంఠము- నుండుటచేతను, వానికిఁ బ్రళయ కాలములందువినాశమును-గల్గుటచేతవిష్ణ్వాదిదేవతలస్థానములుదుఃఖభూయిష్ఠములు.

క. వనజాసనేంద్ర పదవులు
ననఘులు మదిలోనఁ గోర । రనినఁ స్రక్చం
దనవనితాముల భోగా
ల నివాస సుఖంబుఁ గోరు । కష్టులు గలరే. ౧౧

తా. బ్రహ్మాది దేవతల స్థానములే తత్త్వజ్ఞులు గోరరని వచించినచో, క్షణికముల గు స్రక్చందన వనితాది భోగములఁ గోరుమూఢు లుందురా?

క. వేమఱు సంకల్పంబునఁ
గామము జనియించు దీని । క్రమ మొఱిఁగి జనుం
డేమియు సంకల్పింపక
తామసగుణ ముడిగెనేని । తత్త్వజ్ఞుఁ డగున్. ౧౨

తా. ఈ కామము [కోరిక] సంకల్పమునఁ బుట్టుచున్నది. ఈ విషయమును మానవులు దెలిసికొని, తామస గుణము వలన కలిగెడి సంకల్పమునేవదలితత్త్వజ్ఞానులగుదురు.

క. కామింప వలవ దెద్దియుఁ
గామించిన మోక్షసుఖముఁ । గామింపఁ దగున్
భూమినట మీఁదఁ మోక్షముఁ
గామించుట మిగుల బుద్ధి । గాదంద్రు బుధుల్. ౧౩

తా. ఏదియుఁ గోర కూడదు. కోరినచో భూమియందు మోక్ష సుఖమువంటి సుఖమును గోరవచ్చును. అటుమీఁదఁదిరిగి మోక్షమే కావలయునని కోరుటతగదనిపండితులు చెప్పుదురు.

కామ పరతంత్రులైనట్టి ◆ కష్టజనులు ౧౮

తా. కాముకునకు లోఁబడిన వారెవరనఁగ- మూర్ఖులు- దుర్మార్గులు- పుండ్రకులు- దుంబోరాపుగలవారు- ప్రతిజ్ఞ సేయువారు- పెదబొజ్జలు కిక్కా- వినయముగలవారు- ఒకవేషులు బిడాలాచారను గలవారు కోటబుద్ధిగాని, కాకిబుద్ధిగాని, కలవారు- చాడీలు చెప్పువారు- పరిహాసకులు, దొంగలు పొందలగువారలు.

వి. ఒక వేషు లనగా:- కొందరు కాలు కదల్పక మునిపలె నిశ్చలముగా చేపలు దొరకు వచ్చునంత వరకుండును. చేపలు రాగానే గుటుక్కున మ్రింగును అలాగే కొందరు చేయరాని పాపములు చేసి కార్యసిద్ధి పర్యంతము నటించువారు.

బిడాలాచారవంతులు:- పిల్లిగోడమీద నుండి చూచుచున్న కనుకూలము గానున్న యూవైపునకు దూకును. అటులే కొందరు తమకేటువైపున వీలుగానున్న నటుమాటలాడువారు

క. ఎందఱు గీర్వాణులు చెడ
రెందఱు సంయములు చెడరు ◆ హీనాత్మకులై
యెందఱు సూలరు నరవరు
లెందఱు దూలరు మనుష్యు ◆ లీ కామముచేన్. ౧౯

తా. ఇంద్రాది దేవతలు చెడుటయును విశ్వామిత్రాది మునులు భ్రష్టులగుటకును ఇంకనునేక పండిత పామరులు నశించుటకును కోరికయే గదా కారణము.

ఉ. కామము కృత్యముల్ నిజము ◆ గా మదిలోఁ దలపోసిచూచియుం
గామము దుర్వికారమున ◆ ఘంబుల మూలము నౌటెఱింగియుం
గామము పగ్గలంగఁగోల ◆ గాదనియుం దెలియంగ నేర్చిని
ష్కామతి నైనఁ గామమక ◆ టా బలిమాల్చున నేకభంగులన్. ౨౦

తా. ఎవఁడు కామమును పాపమూలముగా నెఱుంగునో, ఎవఁడు కామమును నీచాతి నీచముగాఁ దలంచునో, అట్టివానినైన అయ్యో! ఈపాడు కామము నశింపఁ జేయుచున్నది గదా.

వి. శ్లో॥ కిముత వలయ నేతిర్విస్మితో నాకనార్య । స్త్రిదివ పతిరహల్యాం తాపసీం యత్సిషేవే। హృదయ వనకుటీరే దహ్యమానే స్మరాగ్నౌ । వు చితమనుచితం వా వేత్తి నా పండితోపి॥ దేవేంద్రుఁడు కోరిక, నసమానరూప రేఖావిలాస సంపన్నులగు న

ఆ. వె. ఎంతవారికైన నెంతయుఁ జాటులఁ
జిక్కుమనసున నింకఁ బ్రజ్ఞ లేల?
హీనజనులఁ జేయును బొంతెటి ఘనిపాప
కర్మహేతువైన కామమునకు. ౧౩

తా. పాపమునకు హేతువగు నీ కామము, ఎంతటి మహానీయులనైనను బతిహీనపా త్రులను గాఁ జేయుచుండఁగ, హీనుల విషయమై యడుగనేల?.

క. కామంబు కతమునఁ గల
నేమంబులు విప్పుచెఱుతురు సరిజముఖులున్
ధామములు మొదలు గామది
నేమియు నెల్లక చరింతురు దగ్ధచరితుల్. ౧౪

తా. సత్పురుషులు కామ భయముననే స్త్రీలు, కర్మలు, గృహములు, మొదలగు వాని వదిలి పెట్టుదురు.

క. భువిఁ గామయుక్తి గలవై
భవములు విషగర్భ మధుర ఫలములు కామం
బువలన వచ్చు దుఃఖంబులు
నవిరి యమృతి కరములైన తిక్తౌషధముల్. ౧౫

తా. జ్వర పీడితునకు, మధుర పదార్థము విషమైనట్టులను, చేదు పదార్థ ము మృతమైనట్టులను, మోక్షము నంద దలఁచు వానికిఁ గామమువలన సంభవించెడి వై భవములు, విషమయ ములును, అందు వలన వచ్చెడి దుఃఖములు, అమృత మయ ములును నగును.

క. పంచ మహాపాపములకుఁ
జంచల గతినుండఁ దగిన సదనము గామం
బంచితము ఖ్యాచారం
బంచుక యును గలుగనేర బెల్లుటినైనన్ ౧౬

తా. కామము పంచమహా పాతకములకు నివాసము. కామాసక్తుడు వానికే స మయ మందును సదాచారముగలుగదు. పంచమహాపాతకములేవియన:-బ్రహ్మ హత్య. క..

త్రాగుట, బంగారము దొంగిలించుట, గురుభార్యను బొందుట, ఈ నలుగురిలో నెవరితో నైన గూడి యుండుట.

క. విదితంబుగా విరక్తిం
బొదలక సంసారమాయం । బొందుతదీయా
స్పదమొద్ది యనినసహజముగ
మదిఁజూడఁగఁ బుష్పశరుని । మాయయె కాదే. ౨౭

తా. జనులకు వైరాగ్యము గలుగక సంసారము నందలి ప్రేమ గలుగుటకుఁ గారణము మన్మథ మాయయే గదా?.

ఆ. వె. మరుని మాయవలన । మఱి గుటయొప్పదు
వాఁడు దోషకారి । వానిచేత
నమర వరులు మునులుఁ । బహుమానములు గోలు
పోయిమిగుల మోసఁ । బోయినారు. ౨౮

తా. మన్మథ మాయకులో బడుట మానవులకు నుచితము గాదు. ఆమారుని చేతనే బ్రహ్మ తనకూతు నందును, విష్ణువు, గోపిక లందును, రుద్రుఁడు ముని యువతు లందును దగుల్కొని నారు. మహారణ్యము నందుఁ గంద మూలఫలములఁ దినుచు నాత్మ సుఖము గాంచని ఋష్యశృంగాదిమునులు సదా వేశ్యా రత్నముల పాదపద్మములందు దాసులై పడియుండి యాత్మ గౌరవమును గోల్పోయినారు.

క. వేయును నేటికి మన్మథు
మాయతొలుత జవికిఁజూడ । మధురము సహజం
బైయున్న విషం బిదియక
డాయొందుదను మోసపోక । తనయుట యొప్పున్. ౨౯

తా. పలుమాటలతోఁ బనియేమి? కాంతా సంభోగాది మదన చేష్టలు చవిచూచి నంతనే రుచితో మధురముగా నుండును. విచారింపగా నంతటి విషము లేదు. కావున పంచబాణుని కుసుమ బాణముల వలన మోసపోకుడు.

క. కామిను లిరంతరంబును
దాముందట నమరనొద్దిఁ తరుణుల నెడయు

ఉ. చేతలలోన నెల్లఁ గడుఁ జేతకృతాంతుని సమ్ముఖంబు దా
రోతల కెల్లఁ బుట్టినిలుఁ రోషము కంకు పమృత్యువయూర్ధ్వ పె
న్నాతి సమస్త దోషములకు నుండెడు నిక్కఁ గడంగి యొప్పుచుఁ
జేటికిఁ జేసుగప్పుచిఁ దిక్ చిత్తజు మాయఁ దలంచి చూడఁగన్. 33

తా. సుకుమారములగు వస్తువులలో మిక్కిలి సుకుమారము, యమపురి కేగుటకు ద్వారము, సకల పాపముల కాలయము, మన్మథ మాయయే గదా?.

క. అసమ విరక్తుల మనుచుం
బసరింపుచు కెలకోసక్ భలకొందఱు దా
రసమాత్ముఁ డొకఁడు దక్కఁగ
గుసుమాస్త్రుని కెన్వరిసురక్ గుదుయూహింపంగన్. 34

తా. మేము విరాగులము, మేము, విరాగులము-" అను సభలలోఁ గొందఱు ప్రజలు సంతోషించుటకై పలుకుదురు; గాని, నిజము విచారింపఁ గాఁ బువ్వు బాణుని గెల్చిన మహానుభావుఁ డీశ్వరుఁ డొక్కరుఁడే గదా?.

—* ఉత్సాహ *—

శైతులకెప్పుడు సీటెలోనఁ జేలుచుండు వారిత
ధ్యముగఁ గరకకాయల దినక్ దైవవారిఁగా విగో
ణములఁ నెట్టువారలైనను వగుచుఁ జిత్తజాస్త్ర చి
త్తము గలంచి చెఱుపనవ్వి తపములు దప్పవల్లదా. 35

తా. ఉమః కాలముకకే లేచి నిత్యకృత్యముల దీర్చికొని యెంతటి శీత లోదకంబు లైనను "శివ— శివా" యని మునుగుచు; గరక కాయలఁ దినుచుఁ, గావి గోచీల బిగించికొని తపంబొనర్చు విశ్వామిత్రాది మునీంద్రుల నెందఱను మదనుఁడు తన కుసుమబాణములకు గురిగాఁ జేయ లేదు?.

చ. మనసిజ కేళి నేర్పునను మానవిలాసము లోలిలోలలో
చనగరువంపు చందమునఁ జయ్యన గోముల హస్తపల్లకం
బున గొనఁ బెట్టవట్టి రతికిఁ పొందునకీయ కొనంగఁ జేయుఁ జూ
చినధృతి కల్మినెల్లనను శిష్టుఁ గదా శివయోగి యెల్లెడన్. 36

తా. రతికేళియందు పాండిత్యము గడించి, యపాంగ ప్రసారము లందు చాతుర్యము నార్జించి, మాటల యందునైపుణ్యము సంపాదించి, తళుకు బెళుకులచే, సహజలావణ్యముచే నెంతటి ధీరునైనను జేపట్టి నిమిషములో స్వాధీనము జేసికొను కాంతామణి వచ్చి యాచించినను, ఏ మహాత్ముఁడు మనస్ఫూర్తిగ నిరాకరించునో, ఆతఁడే శివయోగిసుమీ.

క. కామాతురునకు నిద్రయు
సేమంబును మానము చటుల జేటగును నిజమున్
దేమియు సందియము వలవ
దామీఁదఁ బరత్రహాని యగునందురు బుధుల్. ౩౬

తా. కాముకునకు, ఇహలోకమున సుఖము కలుగునో లేనో సంశయము; గాని కీడుమాత్రము తప్పక కలుగును. ఇందుకు సందియము లేదు. కాములోలునికి పరలోకమున హానికలుగుట సత్యమని విద్వాంసు లందురు.

వ. కావున. ౩౭

తా. కాబట్టి.

క. మాటలు వేయుం జెప్పఁగ
నేటికిఁదను నాత్మఁ జూడనీక సతతముగా
మాటైయున్న మనోజుని
గీటణఁపక శివునిజూచు క్రియ యొప్పెడునే. ౩౮

తా. వేయి మాటలతోఁ బనియేమి? తనను, యాత్మయందుఁ జూడనీయక యడ్డముగా నున్న మన్మథుని జంపక శివుని జూచుటకు వీలులేదు.

తే. గీ. తనకుఁ బుట్టినమనసిజుఁ । దానఁగెలఁగి
పట్టికుదియించి తాళికుఁ । బెట్టలేఁడు
తెలిసి విశ్వాధికుని మహా । దేవుఁబట్టి
లోపఱుచుకొననేర్చు చా । లునుజనుండు. ౩౯

తా. తనకు జన్మించిన వాఁడగు మనసిజుని దండింప శక్తిలేని వారలు- విశ్వాధికుఁడగు మహాదేవునిలోఁ బరచుకొను శక్తిగల వారగుదురా?

మ. పరవిత్తం బణుమాత్రమైనఁ బోరయక ׀ భావింపకే భంగులం
బరకాంతం బరికింప కెట్టి యెడలన్ ׀ భద్రంబుగాఁ జూచుచుం
బరితృప్తి స్థితియున్న భావభవు ׀ భజింపుచా నిక్రియుం
బరమజ్ఞానుల కెట్టి కాముహరణో ׀ పాయం బెఱుగం దగున్. ౪౦

తా. పరధనమును మట్టివలెఁ దలంచుటయు- పరకాంతలఁ దల్లులవలె భావించుటయు, సదా పరమేశ్వరు నుతించుటయు, కామమున ణంచుటకుఁ దగిన యుపాయములు

న. అదియుం గాక. ౪౧

తా. అంతియ గాక.

క. వేశ్యకల్లోఁ బరనారులఁ
జూడంగా వలను తప్పి ׀ చూడఁ బడినఁదాఁ
దోషం బుట్టిన వారల
తోడియటులు చూడఁదగు న ׀ తులధైర్యమునన్ ౪౨

తా. పరస్త్రీలను, జూచుటయే మంచిది కాదు. చూచినచోఁ దన సహోదరీమణులతోఁ బాటు చూడవలయును.

క. ఊలంగునఁ జరియింపఁగఁ
మూలమును భావజుని మాయఁ ׀ దూలఁడు ముక్తిన్
శ్రీలఁ గల్గు ముక్తికి
మూలము వైరాగ్య మండ్రు ׀ మునివరు లెల్లన్. ౪౩

తా. ఇటు చరించువాఁడు, మన్మథ మాయలోఁ బడక ముక్తినొందును. మునీంద్రులందఱు ముక్తికి వైరాగ్యమే మూలమనిరి.

## క్రోధస్వరూపము.



క. తొలితొలి శిఖితన పుట్టిన
యిలుగాల్పక యొరులయిండ్ల ׀ కేఁగునె కోపా

తే. గీ. పానవేటికిఁ గ్రోధంబుఁ బాయలేని
పచ్చిమాలకు వేదోక్త భవ్యనిష్ఠ
లేమిటికి నేటి గురుభక్తి యేటిశివుని
భక్తి వానికి నెక్కడి భక్తి భక్తి. ౫౧

తా. క్రోధంబు వదలజాలని వానికి ప్రాణమెందుకు? వేదోక్త మంత్రాచరణము లెందుకు? గురుభక్తి యెందుకు? శివభక్తి యెందుకు? అట్టివాఁడు విచారింపగా చండాల సదృశుడగును సుమా? వానికిభక్తి యుండినను నిష్ఫలము.

ఆ. వె. ఎందుఁ గ్రోధయుతున కెక్కడి శివయోగ
విగ్రహరునకు వాని కెన్నిచాల్ల
పెట్టువానిని యమమెట్టి దైనను నది
రోఁతగాదె రాజె యుఁగని వెట్టి. ౫౨

తా. క్రోధముగల వానికి శివయోగ మబ్బనేరదు. అట్టి వాఁడు శివునిగూర్చి యెన్ని నియమముల వలంబించినను వ్యర్థము సుమా? రాజెయుగని వెట్టిచేయుట వలన గష్టమధికమే గాని భోగంబులు మాత్రము లేదు సుమా?

క. మును క్రోధానలమితరుల
ఘనకౌటిల్యంబు వలనఁ గలుగుట నదిదా
నననవరతంబును శమతా
వనధారలఁ జల్లనార్పవలయు నిజముగాన్. ౫౩

తా. ఇతరుల కుటిల సంభాషణములవల్లను- ప్రవర్తనమువల్లను- క్రోధాగ్ని జనించుచుండును. బుద్ధిమంతుఁ డద్దానిని శాంతి యనెడి యుదకధారలచేఁ జల్లార్చు చుండవలయును.

— * లోభ స్వరూపము. * —

ఉ. లోభము సర్వదుర్గుణములుం వసియించిన చోటునైధన
ప్రాభవ పుణ్యసంపదల వాయముఁ బొందఁగఁ జేయుసద్యశో
లాభముఁ జెందనీదనిత లంచినఁ దానియతాత్ము లెన్నఁగా
లోభముపొంచలఁ బోవుభువి లోపల నెంతయు బుద్ధి మంతులై

తా. లోభము సర్వ దుర్గుణముల కాలయము. అందువలన కీర్తి ప్రతిష్ఠలు నశించును. పుణ్యసంపద లడుగంటును. గాన ధీమంతులా లోభము పొంత బోకచరింతురు.

క. కలలోని జాడనస్థిర
ములు హేయంబులు నసార। ములునై సధనం
బులులోభ పశులు సుస్థిర
ములయని మదినమ్మి మోస। పోదురు జగతిన్. ౫౫

తా. కలయందుఁ జూచిన వస్తువులవలె నస్థిరములై తుచ్ఛంబులగు ధనంబులనే నమ్మియసారమగు సంసారమున బడినీదులాడుచు దరి గానక లోభపిశాచమున నావరింపబడి కొందలుసంచరింతురు. కాని యదియంత యనిష్ట ప్రయోజనము.

సీ. తల్లిదండ్రుల నైన। దగు తరుణుల నైన
విడుతురు లోభంబు। విడువలేక
నిజకుమారుల నైన। సింధుబాంధవు నైన
విడుతురు లోభంబు। విడువలేక
బంధుజనుల నైనఁ। బరమ మిత్రుల నైన
విడుతురు లోభంబు। విడువలేక
భవ్యశీలము నైన। ప్రాణంబు లైనను
విడుతురు లోభంబు। విడువలేక
గీ. వారిఁగనుఁగొని లోభవి। దూరులైన
వారునగుచుందురు సువి। చారలీలఁ
జారునిర్వాణ లక్ష్మికి। వారె కారె
భర్త లగుదురు శివ యోగ। భరితు లగుచు. ౫౬

తా. లోభులు గడ్డి గవ్వయైనను ధనంబును వదలలేక తల్లిదండ్రుల నైనను- కుమారుల నైనను- భార్యల నైనను- బంధువుల నైనను- మిత్రుల నైనను- చివరకు ప్రాణము నైనను వదలిపెట్టుదురు. అకటా! ఇట్టివారిని జూచిలోభరహితులునవ్వుచుందురు. విచారింపగా నిట్టి వారలేకదా? మోక్షలక్ష్మికృపా కటాక్ష పాత్రులగు చున్నారు.

ఆ. వె లోభిదుర్జనుండు। లోభి కెక్కుడి శివ

భక్తి? యేటి యోగ? యుక్తి? యెందుల
వాని కేల గల్గు? నం భుక్తిముక్తులు
వాడు సత్పథంబు వాడుగాడు. ౫౭

తా. లోభియున్నవాడు సమానులు. శివయోగము గాని, శివభక్తి గానిలోభికి గలు
గనేరదు. సన్మార్గమున వాడెప్పుడు చరింపడు.

క. ఘనలోభ నరాత్మనిధన
మనలంబునఁ గాలుఁ బొందె నంబుపాలౌ
జననాథుఁ జేరుఁ జోరులు
గొనిపోదురు మూషకములు గొనిపోవు నొగిన్. ౫౮

తా. లోభిధనము దొంగల పాలగును. లేనిచో నగ్నియందు గాలిపోవును. లేనిచో
నుదకము పాలగును. కానిచో రాజుచే నపహరింపఁబడును. ఎవరికిఁ జేర నిచో మంటి
పాలగును. సందియము లేదు.

క. గురువులకును దేవరకును
వరభక్తులకును మునీంద్ర వరులకు దీనా
తురులకుఁ జేరును లోభము
బోరమని యనఘాత్మ ధనము బుధులు నుతింపన్. ౫౯

తా. లోభిత్వము లేనివానిధనము దేవతలకు- గురువులకు- భక్తులకు- పండితులకు-
దీనులకుఁ జేరును.

క. లోభము విడువఁ గనేరని
ప్రాభవ పురుషుండు నిత్య పటుయశుఁడు గదా
లోభము విడువఁగ నేర్చిన
ప్రాభవ పురుషుండు నిత్య పటుయశుఁడు గదా. ౬౦

తా. లోభమును విడువ జాలని వాడు జీవించియు మరణించినవాడే. లోభమును
విడిచినవాఁడు మరణించినను యశశ్శరీరమున జీవించియున్నవాడే యగును. లోభికి నప
కీర్తియు- దాతకుగీర్తియు గలుగునని భావము.

ఆ. వె. అఖిల దోషములకు నాదికారణము

నపయ శంబువకుని జాలయంబు
నైనలోభమాత్మ నంగీకరించుట
నియతమ తులకెల్ల నీతి గాదు. ౬౧

తా. సర్వదోషములు- అపకీర్తియు లోభంబుననే జనించును. కాన నీతిమంతులు లోభంబు విడువవలయును.

క. తనమది లోభము విడువక
యనఘుఁడ యోగీశ్వరుండ నత్యంతతపో
ధనుఁడ సదాచార పరుఁడ
ననునెవ్వఁడు వానిమాట లవిప్రల్లదముల్ ౬౨

తా. ఎవఁడు లోభమును విడువక నేనేయోగీశ్వరుఁడను- సదాచార పరుడను- తపోనిష్ఠాగరిష్ఠుఁడననియుఁ బలుకునో, అట్టి వానిమాట విశ్వసింప దగినది కాదు. వానిమాటలన్నియు నసత్యములేయని నమ్మవలయును.

సీ. ఘనతరంబగు లోభ మునఁ గూడఁ బెట్టిన
ధనమెల్ల విషసమం బనియులోభ
విరహిత స్థితిగల విదిత శాకాహార
మైనను నమృతోప హారమనియు
తెలసిలోభ గుణంబు తెంపుమై విడిచినఁ
బెంపుచాలను గల్గి పృథులదాన
భోగవిహార సంపూర్ణ స్వభావుని
శివపూజ నాసక్త చిత్తులగుచు
తే. గీ. శివపురాణ శివస్తుతి శివకథావి
నోదములఁ బ్రొద్దుపుచ్చు చుం డుదురు శైవ
పరులు శివయోగ సిద్ధమృత వార్ధిఁదేల
లాడుచును శివుఁదక్క నన్యంబులుడిగి. ౬౩

తా. శివయోగులు లోభమున నార్జించిన ధనమంతయును విషంబని తలంచి- లోభము లేకుండ నార్జించిన ధనము నమృతోపహారంబని తలంచి దానంబు లొసరించుదురు-

భోగంబులను భవించుచు- శివపూజ నాచరించుచు- శివకథల వినుచు- శివభజన సేయు చు- కాలము వెళ్లించెదరు.

క. చంచలములు ప్రాణములతి
చంచలములు సిరులుమిగులఁ జంచలములు భా
వించఁగ బాయము లగుటయు
నించుకయును లోభమొలవ దెయ్యెడనైనన్. ౬౪

తా. ప్రాణములే చంచలములు వానికంటె సంపదలు చంచలములు- వానికంటె యౌవనములు చంచలములు. కాఁబట్టిసజ్జను లీరహస్యము దెలిసి కొని లోభ మును వదల వలయును.

సీ. వేయును నేటికిఁ విలయాగ్ని చేత న
గాధంబులైనపఁ యోధులేడు
నమృతాశ నావాసఁ మగుమేరు మందర
హిమవత్ప్రముఖ శైలఁ సముదయమును
గూడంగ నేఁబదికోటుల యోజనం
బులుగల ధారుణీఁ తలము నిముష
మాత్రంబు లోననుఁ మాయమౌ యన రజః
పటలమై పరమాణుఁ భాతినుండు
గీ. నవలి యంబరమును నిట్లఁ యంబరంబు
తక్క దక్కిన సకలభూఁ తములు నంద
యడగు టెఱిగియు నింకనిఁత్యమని యేప
దార్థ మాశించి విడువలేఁ రకట నరులు. ౬౫

తా. అక్కటా! బడబాగ్ని సహితములై యతిగంభీరములగు సప్తసముద్రములు- దేవతల కావాసములగు మేరుమందర హిమవత్పర్వతంబులు, ఏబదికోట్లు యోజనములు గలయీభూమియంతయు, క్షణకాలములో పరమాణువువలె మెలంగుచునాకాశమున విలీన మగుట నెఱింగియు, ఏపదార్థము నిత్యమని భావించి జనులు లోభగుణమును విడువరో గదా?

వ. కావున. ౬౬

తా. కాబట్టి.

క. కనుఁగొనఁగ జగంబంతయు
నసత్యమని మదిదలంచు • టదియో లోభం
బనుపగతు సంహరించెను
ననుపమ యెఱుఁగంగ వలయు • నచలిత బుద్ధిన్. ౬౭

తా. జగంబంతయును నిత్యంబని మనంబునకు దోఁచి నచో, లోభంబుండ నేరదు.

## —* మోహస్వరూపము. *—

సీ. మోహాంధ కారంబు • ముక్తిత్రోవకు మఱుఁ
గైయుండు నని చెప్పి • రాదిమునులు
మోహంబు సాహసం • బున విడిచిన యుత్త
ములు దుర్భవాంబుధి • వలను జొరరు
పత్నులు పుత్రులు • బంధులు మిత్రులు
పశువులు మొదలైన • బహుధనములు
ననయంబుఁ గూరిమి • జనియింప నవిఘటి
యింపంగ నవిచేయు • నెడలమనసు

తే. గీ. లందునుడుగని దుఃఖాగ్ని • యుండు నుసుకఁ
జేయు నుకుతర పుణ్యులఁ • జేరి మోహ
మదియ కాదె యోగీంద్రుల • నైనఁ జెఱచు
మర్త్యులెంత సంయోగంబు • మఱిగి నేని. ౬౮

తా. మోహపిశాచ గ్రస్తులగు మానవులకు ముక్తి మార్గము దొరుకదు. మోహంబు వదిలిన వారికి సంసార భయం బణుమాత్రము పొంద నవసరము లేదు. స్త్రీలు—కొమరులు బంధువులు— మిత్రులును— పశువులు— ధనము గృహము మొదలగు వాటి యందు కూరిమి గల్గుటయు— ఇందు నేదేని పోయి నపుడు మహాదుఃఖమునను భవించుటయు— మోహమని చెప్పఁ బడును. ఎంతటి మునీంద్రుల నైనను, నీమోహము తనవలలోఁ బడవేసికొనుచుండ మానవుల విషయమై చెప్పనేల?

క. అమ్మోహము సంగతి నిము

సత్తైనను నిలిచియున్న • జనునకుఁ గడుదో
షమ్మగు నంట తొనని వా
సమ్మంట మోహంబు • సకల సంసారులకున్. ౬౫

తా. ఆమోహము నిముస మాత్రముండినను మహాదోషము సంభవించునుగా నసంసారులకు మోహము మహా సంకటము.

చ. ఉడుగక మోహ ముల్లమున • నున్న కతంబున నేకతంబునన్
మృడు మదినిల్పి మర్త్యులును • మెచ్చఁగఁ గొల్వఁగ లేరు సత్యముం
గడు నియమంబులున్ విహిత • కర్మములుం దుది మోక్షలక్ష్మియుం
జెడు భవపాశ బంధముల • జిక్కులు వీడవు మోహ సంగతిన్.

తా. మోహము వదలక యుండినచో, రహస్యస్థలంబున గూర్చుండి నను— మనస్సునిల్పి యీశ్వరుని గొల్వఁ జాలఁడు. అతఁడు నియమంబులు, సత్కర్మములు, పరిపాలింపకఁ బోఁగా సంసార పాశాబంధితుఁడై మోక్షలక్ష్మి నిగ్రహింపఁ జాలఁడు.

వ. మఱియు నత్యంత భక్తిపూర్వకంబుగా నిరంతరంబును హృదయ వాక్య ధన తను శుశ్రూషలు నాలుగింటను గురువులం గొలువనిదియును, శైవాగమోక్త మార్గంబున నఖిల సుర ముని నికరావ తరణ సమన్విత శివ లింగార్చనా విశేష కృత్యంబులఁ బరమానుమోదంబుల దినములు గడపనిదియును, వైదికాచారపరాయణులై శివుఁదక్క నన్యం బెఱుఁగక రాగద్వేష విరక్తులును, గురులింగ జంగమ భక్తియుక్తులును భవముక్తులు నతి పవిత్రులు నైన మహాభక్తవరుల నింటికిఁ దెచ్చి యుచితక్రమంబున బూజించి యలరింపంజేయనిదియును, శివోదితంబైన యోగంబవలంబించి మహానుభావులైన శైవుల దర్శించుటకై వారలున్న యెడలకు జననిదియును, మనోవాక్కాయ కరణంబుల నచలితంబులైన తపంబులు గైకొననిదియును, సన్మార్గ వర్తులయిన పెద్దల బాడఁగని దయాభరిత భావంబునఁ బ్రోవనిదియును శివయోగీంద్రుల వల సయోగ రహస్యంబులు వినవలయునన్న విమల బుద్ధిజనింపనిదియు

ను, సరసగతి నతిచతుర వచన రచనల బ్రమరంబుగా గురు లింగ జంగమశివభక్తుల నభినుతించెడు గుణంబుజిహ్వకుఁగలుగనిదియును నశ్రౌత పాషండ శాక్తాది నానావిధ కుమతవర్తనుల యైన దురాత్ములఁ బరిత్యజింప నిదియును శివధర్మ తత్పరులై శిష్ట జనంబులైన శివయోగీంద్రులఁ జేరిభజింప నిదియును శివమహిమంబులు సెప్ప బహుపురాణ కథాసుధారసంబు కర్ణపుటంబులఁ గ్రోల నిదియును శివయోగ జ్ఞాన జనితాభ్యంతర నిరంతరనితాంతసుఖాను భవంబున నస్పందిత నిరుప మానందంబునం బొందనిదియును మోహంబని చెప్పం బడును. ఇవ్విధంబునమానవుల నైష్కల్యహారులం జేయుచు జన్మజరామరణ స్వర్గనరక ప్రముఖ నిఖిల దుఃఖాకర నిస్సార సంసార వ్యాపారంబుల వలన నతివ్యాకుల హృదయులంగా నొనరించు నదియునుంగాక.

తా. గురువులను, మహాభక్తితో చతుర్విధ శుశ్రూషలు చేయవలయును. శివాగమోక్తరములందు జెప్పినవిధంబున శివలింగార్చన మాచరింప వలయును. శివుదప్పనన్యులగొలువక రాగద్వేష రహితులు గురులింగ జంగమభక్తియుక్తులు మహాభక్తులనగు సారాధ్య శిఖామణుల నింటికిదెచ్చి పూజింపవలయును శివయోగాభ్యాసులైన 'మహాత్ములున్నయెడకు జనవలయును. త్రికరణశుద్ధిగా దపంబాచరింపవలయును. సత్పురుషులకు పెద్దలదయాపాంగ ప్రసారంబులఁ జూడవలెను. యోగ రహస్యంబుల శివయోగులవద్దకేగి వినవలెను. 'గురులింగజంగమ భక్తుల సంతోషమున నుతించవలెను. పాషండమతస్థుల త్యజించిశివధర్మ పరులగు శివయోగీంద్రుల గొలువవలెను. శివమహిమా ప్రతిపాదితంబులైన శివపురాణంబులనాలకించవలెను. శివయోగ జ్ఞానంబున నాభ్యంతరపూజనం బొనరించి సదానందంబనుభవింపవలెను. ఇవియన్నియు- చేయక పోవుట మోహంబును బొందుట యని వచింపబడును. జన్మజరా మరణ స్వర్గనరక దుఃఖాదుల ననుభవింప జేయుచు కైవల్య దూరుగా జేయునది యీ మోహమే సుమీ?

క. విలసిత సద్గుణ నివహం
బలలోపల మోహావశున కేటికి నింపొఁ
దలపోయ నారఁబడదికి

మలయజ పంకంబుఁ గోరు మదికింపగునే. ౭౨

తా. మోహపరవశుఁడైన వానికి సద్గుణములు రుచింప నేరవు. పంది బురద మెచ్చునుగాని, పన్నీరు మెచ్చునా?

మ. వనితల్ దుర్మలభాండముల్ ధనము సర్వానర్థమున్ ఘనంబైన దుః
ఖనిదానంబు సుతుల్ దురాత్ములయినం గష్టంబుగా నన్వయం
బునకున్ దుర్గతిఁ బొందఁజేయుదురు నీ రోమోహాత్ముఁ డీచందముల్
గనియున్ వేడ్కఁ దదీషణత్రితయ కాంక్షన్ దుర్బుద్ధియై కూలకే?

తా. వనితలా? దుర్మలముల కాకరములు- గుహ్యేష్టలకు- దుర్గంధములకు నిలయములు. ధనమా? సకలదుఃఖములకు నిలయము సుతులా? దురాత్ములయినచో వంశమునకు కళంక మాపాదింతురు. ఈవిషయము లన్నియుఁ జూచుచునే మోహవివశులై మానవులు ఈషణత్రయమునందు పేక్ష వహించుట యెందుకో దెలియదు.

క. ధర్మవిరుద్ధ పథంబులు
దుర్మతులై చూపుచుందురు బాంధవులున్
దుర్మిత్రులు వారలమోహ
కూర్మిఁ బోడము మోహాంధమైన కుమతికి నెపుడున్. ౭౪

తా. బాంధవులును- దుష్టబుద్ధిగలవారైరా ధర్మమార్గములనే బోధింతురు. మోహవశుడగు వానికి దుర్మార్గుల యందె కూర్మిగలుగు చుండును.

ఉ. ఎట్టిపదార్థమై నభుజిన్ యుంచిన యప్పుడె దుర్మలంబ యా
నట్టి పదార్థ సంచయము నంగొదనున్ గిల్చి సహించు శాపముల్
పుట్టిన రాజ్యసంపదలుక్ సొంపులు కైకొనఁ గోరుచుందునే
పట్టున మోహయుక్తుఁడగుచో శాలిగుఁ డెంతయు మోహచిత్తుఁడై

తా. ఎంతటివిలువగలపదార్థమైనను- ఎంతటిరుచిగలపదార్థమైనను తినిన వెంటనే మల స్వరూపమునొందును గదా? అట్టిపదార్థము నెదను రాగమువహించుటయు- పాపసంకులము గు రాజ్యసంపదల కాశించుటయు మోహయుక్తుడగు బాలిశుని కృత్యములు

తే. గీ. మెఱుపులును బోలె నిలుకడలేని సంపదలకె

మిథ్యలగు దుర్భవస్థితులఁ మెచ్చియనుభ
వింపుచును మోహవశులై వివేకహీను
లగుచుఁ బరలోకచింత సేయంగ మఱచి. ౭౬

తా. పరలోక విచారమనుమాత్రమును లేక వివేకము లేక మెఱుపువలె క్షణకాలము కన్నులకు మిఱుమిట్లు గొల్పు కాంతామణుల మోహించి జనులు నశించుచున్నారు.

క. మోహంబను శత్రువిధ
మూహింపఁగ దొడ్డు గాదె యొక్కొకయెడఁ దా
నో హా! తజ్జ్ఞులనైనన్
సాహసమున ముంచు గ్రోయు సంసారాబ్ధిన్. ౭౭

తా. శత్రువు లందరిలో మోహంబను శత్రువు మహాబలశాలి. ఆతఁడెంతటి పండితునినైనను సంసార సాగరమునఁ బైకి తేలకుండ జుట్టుపట్టి ముంచుచుండును.

మాలినీవృత్తం. తెరువరు లొకచోటం దెల్లఁగాఁగూడి యయ్యై
పురములకు యథేచ్ఛం బోవుచందంబు దోఁపం
బరువడి నెపుడున్ హా బ్బాంధుసంఘంబు గూడన్
విరియఁగఁ గనిమోహావేశతం బొందనేలా. ౭౮

తా. బాటసారు లందరొక్కచోఁ గూడి తెల్లవారి జామున నే లేచియెవరి పనులకు వారటుల బోవుచుందురో, అటులే బంధువు లందరు- ధనమున్నంతవఱకో, లేక బంధుత్వ మున్నంతవఱకో, తన్నాశ్రయించి యుందురు. గాన నీమాత్రమునకై ప్రేమ వహింపనేల?

క్రౌంచపద వృత్తం. గ్రాహక బుద్ధిన్ స్నేహము నొందం
గనప్పును బుధుకయోఁ గగినిసమంబై
దేహము నెల్లన్ దాహము సేయుం
జెరువగు ననిమదిఁ దెలిసి సముద్య
త్సాహస వృత్తిన్ మోహము వీడన్
జగతి గిరియుఁ దృణక సదృశతరంబా

నైహిక సౌఖ్యోన్నత్యానా హమరమో
హాముపిడఁ దగుఁ బరగ్ మభిమత మైనన్. ౭౯

తా. ఐహిక సౌఖ్యము వదిలి పరసౌఖ్య మందిష్టము గలవాఁడై మోహామువదలినే నిఁ బర్వత మయిన తృణ సమానం బగును. పరసౌఖ్యము వదిలి యైహిక సుఖ మాశిం చి మోహ జాలమున బడినవానికి తృణమైనను బర్వత సమానముగా గన్పించును.

క. వృక్షమున రాత్రి బహువిధ
పక్షులు వసియించి తెల్లగ్ వాలంగ యథా
పేక్షలఁ జనుగతి బంధువు
లక్షయముగఁ గూడివత్తుగ్ రయ్యొ యెడలన్. ౮౦

తా. రాత్రియందుఁబిట్టలన్నియుఁ జెట్టుమీదఁజేతి తెల్లవారగనే పోవువిధముగ—మిత్ర పుత్రాది బంధువులా యాసమ యముల ననుసరించి చేరుదురు. గాన వారియందు మోహాము పెట్టికొనుట వట్టిభ్రాంతిచేసుమా?

క. జనులు వెలియపలదె మహాం
బునిధిం గాష్ఠములు గొన్నిగ్ పొందపికొని నడిం
జనుదెంచి యెడనెడన్ వి
చ్చిన యట్టుల కాదె సకలగ్ సృష్టియు నరయన్, ౮౧

తా. ఈప్రపంచ మందలి సృష్టియంతయు— మహాసముద్రమునపయిమండికొట్టుకొని వచ్చిమధ్యనొక చోటఁ గలసి మరల విడిపోవుకట్టెలవిధముగనున్నది గదా? దీనిజూచి మోహాము నొందనేల?

ఉ. తప్పక సర్వబాంధవ విగ్ తానమా బుత్రులు మిత్రభృత్యులున్
జెప్పగఁ నున్న వారనుచుఁగ్ జిత్తములో నలరున్ జనుండు వా
ట్ట్రప్పున మోహరజ్జుల సగ్ ముద్ధతిఁ గట్టుచు ధర్మరాజులఁ ద
న్నొప్పన సేయనున్న కటుగ్ నుగ్రపు దాయలుగారె యారయన్.

తా. పుత్రులు- మిత్రులు- భృత్యులు— మొదలగు బాంధవు లందఱు తన్నుసుగతికి బంపింతురని మానవులు తలంతురు గాని, మోహపాశముల బంధించి యమునిసన్నిధికి గొనిపోవుదురని తలంపనేరరు గదా?.

వ. కావున. ౮౩

తా. కాఁబట్టి.

క. పుత్రులపై మిత్రులపై
గోత్రులపై నింతఁ మోహగుణము నిలిపినఁ
సూత్రగతి నదియొనరునకుఁ
జిత్రముగా బాధనంబుఁ జేయంజాలుఁ. ౮౪

తా. పుత్రుల మీదగాని, మిత్రుల మీదగాని, సగోత్రుల మీదగాని, మోహమే మాత్రముంచిన నుసది బంధమునే గలుఁగజేయును గాని ముక్తి గలుగఁ జేయదు.

తే. గీ. మోహ నిర్మోహములు బంధ । ముక్తి కార
ణంబులగుటను మోహ । గుణంబు ధైర్య
ముదయను కత్తితోఁగోసి । మోక్ష సుఖముఁ
జూఱగొనవచ్చు వెసనది । సులభ మతము. ౮౫

తా. బంధ ముక్తులకు గారణము మోహదుర్మోహములు- కావున ధైర్యమను కత్తితో మోహలతను నరికివేయ వలయును. ఇటుల మోహము జయించి కాని మానవులు ముక్తినొంద జాలరు.

## —— మదలక్షణము. ——

చ. సకల కలాకలాప సువి । చారదుఁడై మదాంధుఁ డయ్యేనే
నొక యెడనైన మంచి గుణ । ముల్లమునంజొర నీకస్మత్క్రియల్
వికలతఁ బొందఁ జాలన వి । వేకియగుఁ శివునాత్మలో నెఱుం
గని భవబద్ధుఁడౌచు నప । కారము సేయును సజ్జనాళికిఁ ౮౬

తా. సకల శాస్త్రంబులు నేర్చిన మంచివిద్వాంసుడైనను మదాంధుఁడైనచోఁ నవివేకియగును. అతనికి మంచి గుణ మొకటియు పట్టుపడదు. శివస్మరణము సేయక మూర్ఖుఁడు సంసార కూపమునఁబడి సజ్జనుల కపకారము సేయుచుండును.

క. విదితముగ నస్థిరపు సం
పదలు నిజములనుచు నమ్మి । ప్రల్లదుఁడై మదు

ర్మదుఁడైన చెనఁటి మనుజుం
డా దురెఱుఁగక విఱ్ఱవీఁగు ॥ నిమ్మహిలోనన్. ౪౭

తా. ఆస్థిరములైన సంపదలను స్థిరమని నమ్మి మదాంధుడు తనకెవరు లేరని విఱ్ఱవీగుచుండును.

చ. సిరిక్రియ గాలిచందమున ॥ శీతమయూఖుని భాతివిద్యుదు
త్కరము తెఱంగు నంది వియ ॥ త్పైవడి నంబుధ రాలిచాడ్పునం
తరుణుల మానసంబుల పె ॥ థంబున వార్థితరంగ భంగిన
స్థిరములు దేహముల్ మద వి ॥ జృంభితు లౌదురు మర్త్యులేలకో.

తా. సంపదలు- వాయువు- చంద్రుడు- మెఱపులు- దీపములు- మేఘములు- తరుణుల మానసములు- తరంగములు- క్షణభంగురములైనటుల దేహములు క్షణభంగురములు గదా?. ఈవిషయమును దెలిసియు మదంబున కన్నుమిన్నుగానక కొందఱు చరించుటకేమి కారణమో గదా!

శా. దేహం బస్థిరమంట గన్గొనిమదో ॥ ద్రేకంబునం బొందకా
దేహంబు న్మనముద్ధనంబు నతిభ ॥ క్తిన్ సద్గురు స్వామికి
స్నేహారాద్రి సుతామనో హరునకు ॥ న్నిత్యంబు తద్భక్తియు
క్తాహీనాత్ములకు న్వివేకులగు వా ॥ రర్పింతు రెల్లప్పుడున్. ౪౯

తా. వివేకులు దేహమస్థిరమని తలంచి మదోద్రేకము నొందక మహావినయముతో మహాభక్తితో గురుచరేశ్వరులకు తనుమనో ధనముల నిత్యమునర్పించి సేవించుచుందురు

క. కులశీల రూప విద్యా
బలధనముల వలన మదము ॥ ప్రభవిలు నదియుం
గులశీల రూప విద్యా
బల ధనవంతులనుఁ గనినఁ ॥ బాయదె జగతిన్. ౫౦

తా. కులముసత్ప్రవర్తనము- ధనము- రూపము- విద్యయు బలమును మానవులకు మదమును బుట్టించును. గానికులశీల రూపధనవంతులగు వారెంతటి దుస్థితి ననుభవించుచున్నారో, యొకసారి పరికించినచో నీశరీరి యందే మానవుండు మదంబును బరిత్యజింపడు.

క. కులము గలవారెచట ము
క్తులైరి కులహీను లెల్ల గుది నెచటను ము
క్తులు గారె యోగి జనులే
కులజులుగా కితరులేటి కులజులు దలంపఁగ. ౯౧

తా. సత్కులంబున జన్మించిన వారిలోఁ జాలమంది దుష్కార్యము లాచరించి న రకము చెందిన వారే గాని, ముక్తిఁ బొందిన వారరుదు కులవిచారమును వదిలి పరమాత్మ ను పాసించియే యనేకులు ముక్తి నొందిరి. నిజమువిచారింపఁగా యోగిజనులే కులీనులుగాని యితరుల కులీనులని చెప్పదగునా?

ఆ. వె. నిగమ విహిత శీల నిష్ఠుఁ డూర్ధ్వగతికి
నేగు శ్రుతివిరుద్ధ మింతయైన
నధమ గతికి నేగు నట్లాట నంత సు
శీల వృత్తి ముక్తిఁ జెందు మతియు. ౯౨

తా. వేదానుకూల విధంబున నాచరించిన వారూర్ధ్వ గతికేగుటలో సంశయము లేదు. వేదవిరుద్ధముగ కొంచము ప్రవర్తించినను వాఁడధో గతికే పోవును. కావున సుశీ ల వృత్తియే యనఁగ సత్ప్రవర్తనయే ముక్తికి మార్గము.

క. మనసిజుని కంటె రూపం
బున నధికులు గలరె యతఁడు పురహరు చేతం
గనుమాయన డఁగి పోయె న
నినఁ దక్కిన రూపు లెవ్వి నిత్యము లరయఁగ. ౯౩

తా. అహా! త్రిలోకంబు లందైనను మన్మథుని కంటె మించిన సౌందర్యశాలి లేఁ డుఁగదా! అట్టి మన్మథుఁడు సయితము మీశ్వరునిచే భస్మమై చేయబడెను. ఇఁక నె వ్వఁడీ రూపంబును నిత్యమని నమ్మవదంబుఁ జెందును?.

క. మునుకొని కల్పాంతము దాఁ
క నభ్యసించినఁ జదువులకు కడ యెన్నఁడు లే
దనినను విద్యాధికులిం
క నెవ్వరైనను ధరిత్రిలో గనుఁగొనఁ గలరే. ౯౪

తా. కల్పాంతము వరకు జన్మము గొనినను, జన్మమున కంతము లేదనిగాని సర్వవిద్యాధికుని నొక్కనినైనను వెలుపడచి చూపించ గలరా? కావున విద్యను జూచికొని గర్వించుట తగదు.

తే. గీ. రజతగిరి లీలనెత్తిన రావణుండు
వానిఁదన తోఁకఁ గట్టిన వాలియును న
తని నొకమ్మునఁ దునిమిన దాశరథియు
బలిమిమై నిల్చిరే ధరావలయమునను. ౯౫

తా. వెండికొండను నవలీలగా నెత్తిన రావణాసురుఁడును, వానిని తనతోకలోఁ జుట్టి వేసిన వాలియును, అతనినొక బాణముచేఁ బడగొట్టిన రాముండును, జని పోయినారనిన నిక యీధరిత్రి యందెవ్వఁడు బలమును జూచికొని గర్వించును.

క. క్రమమున మునునృప వరుల
ఘనము లెంతయుఁ గూర్చిరందుఁ దారంబైనం
దమతోఁడం గొనిపోయిరె
యమర్త్య భువనంబునకు నరే యంబారంగన్. ౯౬

తా. తొల్లి రాజాధిరాజు లెందఱో ధనము నార్జించి ధరాతల యందున విడిచి చనిరిగాని, వాటిలో నొక దైనను వెంట మూట గట్టికొని పోయిరే? కావున ధనంబుఁ జూచి, యేమూఢుఁడు మదంబు వహించును?.

క. ఊహించి యట్లగుటను గ
తాహంకృతి నుండవలయుఁ దనఘాత్ములు సం
దేహము వలదిది మదజల
వాహపటలమునకు గంధవాహంబెపుడున్. ౯౭

తా. జ్ఞానులీరీతిగా నూహించి యహంకారమును వదిలి నిస్సందేహముగా నుండవలయును. మదమేఘమునకు నిటుల విచారించుట ప్రచండ మారుతము వంటిది.

—*మాత్సర్య లక్షణము.*—

శా. మాత్సర్యంబున బ్రుంగుఁడై పరుగు పర్యాప్తంబు వర్జించు వి

ద్వత్సంగంబు సమస్తదుర్గుణ నిజావాసంబగుఁ జూవను
ద్వత్సంసార మహాటవీ పటుతర వ్యాపార సిద్ధాంత సం
విత్సౌఖ్య స్థితి శైవధర్మమునకున్ స్వావేగ మూపుండగుఁ. ౯౮

తా. మాత్సర్యముతోఁ గూడికొని మానవులు విద్వత్సహవాసము వదిలి దుర్మార్గులై చరించు చుందురు. దాని వలన సంసార లంపటులై దుర్వృత్తులకు లోఁబడి శైవధర్మములను బరిత్యజించి నరకంబున కేఁగు దురు కాన మాత్సర్యంబు విడువ వలయును.

సీ. విద్యాధికులమని పిట్టఁగెడు వారు
మిక్కిలి ధనికులై మెఱయువారుఁ
బ్రకటితైశ్వర్య సం పదలఁ బొందెడు వారు
నిజకీర్తి దిశలనిండించువారు
నిబిడంపుఁ బ్రజకల్మిఁ బ్రబలుచుండెడు వారు
నెరయ దుర్జనగోష్ఠి నిక్కువారు
రూపరేఖా వయో మూర్తిఁ గ్రాలెడు వారుఁ
గులశీలములు గ్రాలి చెలఁగువారు

తే. గీ. వీరువారననేల దు ర్వారగర్వ
భరితబహువిధ సంసార నిరతులెల్ల
నొక్కొకరి కంటె నధికులై యుండనుత్స
హింతు రెంతయు మత్సరా క్రాంతులగుచు. ౯౯

తా. విద్యావంతు లొకరిని మించి యొకరుండ వలయునని, పరస్పరము మాత్సర్యముచేతనే ప్రయత్నించు చుందురు. ధనవంతు లొకరిని మించి యొక రుండవలయు నని ప్రయత్నించుటకు నిదియే కారణము. భోగవంతులు, యశోవంతులు, సంతాన వంతులు, దుర్జన సహవాస ధురంధరులు, రూప వయస్సంపన్నులు, కులశీల సంయుతులు, వీరు వారననేల? మహాగర్వ సమేతులై సంసార రతులై యొకరిని నొక రతిశయించి యుండ వలయునని యందఱునిత్యము ప్రయత్నించుటకే మత్సరమే కారణము.

క. ఒకకొందఱు మత్సరమున
నెకవెక్కుచుఁ గ్రిందుమీఁదు నెఱుఁగక దుష్టా

గ్నకులై తెలియఁగనేరరు
సకలంబును నీశ్వరాజ్ఞ జనియించుంగా. ౧౦౦

తా. లోకంబునఁ గొండఱవివేకులు మత్సరమున స్సమస్తము నీశ్వరాజ్ఞవలన జరుగుచున్నదని తెలియనేరరు.

క. ధూర్తుల సంగతిఁ బాయక
వర్తించు దురాత్ములైనవారలు వాదు
ప్కీర్తి యుతులైన మత్సర
మూర్తులు వారలకు భుక్తి ముక్తులు గలవే. ౧౦౧

తా. ధూర్తుల సహవాసమొనర్చుచు మంచిచెడ్డల గుర్తెరుగక యహంకారులై యపకీర్తికైననుదలయొగ్గి సంచరించు దురాత్ములకు భుక్తిముక్తులు సంభవించుట దుర్లభము.

సీ. క్షణభంగుర ప్రశస్తములు జన్వనములు
సరసిజ దళబిందు తరళదములు
కరికర్ణ చపలముల్ కాయంబులన్నియు
విదితవైభవము బుద్బుదసమంబు
పుత్రదారాదులు ద్భుత మాయరూపులు
మిత్ర బాంధవకోటి మెఱుఁగులట్ల
బహురూప ఘటనా ప్రపంచమీ సర్వంబు
స్వప్నవిధము జగజ్జాలమెల్ల
తే. గీ. నింద్రజాలోప మాన మూహించిచూడ
నింతయునునని మదిలోన నెఱుఁగలేరు
కుమతులగువారు మత్సర భ్రమితులగుచు
వారలకు నగమ్యంబు వైష్ణవపదము. ౧౦౨

తా. అయ్యో! లోకులీ మాత్సర్యమునఁజెడి పోవుచున్నారు. కాని సత్యమువిచారింపరైరి. అహో! యౌవనమా? క్షణభంగురము. తామరబిందువువలె చంచలమైనది. శరీరములా? ఏనుఁగచెవులవలె నతిచంచలములు. వైభవములా? స్ఫటిబుగ్గలవంటివి. దారాపు

త్రాదులా? యశాశ్వతులు. మిత్రబాంధవులా! మెఱుపు వంటివారు. అనేక రూపంబుల భాసిల్లు నీప్రపంచంబంతయు- విచారింపఁగా స్వప్నసదృశము. ఈప్రపంచమును నింద్రజాలోపమానముగఁ గాంచనేరక మత్సరగ్రస్తులై మెలంగు కుమతులను కైవల్యపదముల భింపదు. కావున మాత్సర్యంబు విడువవలయును.

వ. మత్సర మనన న్యశుభ ద్వేషంబు. ౧౦౩

తా. మత్సరమనఁగా- ఇతరుల మేలుమాచి యోర్వఁజాలకుండుటయే.

క. మత్సర రహితుల కనవర
తోత్సాహాన్వితుల కతులు యోగజనిత సం
విత్సుఖ పరవశ మతులకు
వత్సలుఁడై యుండు శివుఁడు వరదుండగుచున్. ౧౦౪

తా. మత్సరము విడిచి యోగము నవలంబించి యా యోగమువలన జనించు నానందరసము గ్రోలుచుం గాలంబుగడుపు మహాత్ములకు శివుండు తోడునీడై యుండును.

క. రభసమునకు జనసంగతి
ప్రభవించుచు నుండు మాత్సరము దీనన కా
దె భవభయం బెడనుఁగక
యుభయగతుల్ బొందలేక యుండుదు రధముల్. ౧౦౫

తా. సంతోషమున జనులితరుల గొప్పచేయుచుందురు. దానినాలోచించి కొందఱతమను గొప్పచేయలేదను నసూయనుబొంది దుష్కార్యము లాచరించి సంసారమునుండి తరించ లేకయు- ఇహలోక సుఖమునకు- పరలోక సుఖమునకు దూరులగుచున్నారు

క. తగులుచుఁ సంసర్గన దో
ష గుణంబులు పుణ్యములు నిజంబుగ ననుచున్
నిగమార్థంబులు మ్రోయుట
దగునె దురాత్ములకు నొడిఁ దగులెవ్వరికిన్. ౧౦౬

తా. సత్సహవాసమున సద్గుణంబులును- దుస్సహవాసము వదుర్గుణంబులును సంభవించునని వేదంబులు మ్రోగుచున్నవిగదా!. కావున దురాత్ముల తోడిస్నేహంబొనర్చుట కంటెఁ బాపకృత్యము వేరొకటిలేదు.

క. ధరలోన ఁజాద కాంతపు

గిరిప్రాంతను దర్పణంబుఁ బ్రక్కేవఁగనుఁగొనన్
గిరికరి కరిగిరియొప్పును
సరిసద సద్భుజను మిత్రి చూదమె కాదే. ౧౦౭

తా. చంద్రకాంతపు పర్వతమునందుగాని, దర్పణమునందుగాని- పర్వతము ప్రతిఫలించినచో ఏనుగుగాని? ఏనుగు-ప్రతిఫలించినచో పర్వతముగాని, తావటుల సత్పురుష సహవాసమున దుర్జనులుగాని, దుర్జన సహవాసమున సత్పురుషులు గాని, గాజాలరు.

ఉ. ఎత్తరి నెట్టివారి భజి యించిన నట్టిడమై చరించు న
త్యుత్తముఁడైన నెట్లనిన నోలినవజ్ఞత నొందునైనఁ దా
హత్తుచుఁ దత్తదాకృతి య యాశశికాంతపు భాతిగావునం
జిత్తమెలర్ప నుత్తములఁ జెందుచుమానవృఁడట్లకాఁదగున్. ౧౦౮

తా. ఉత్తముల సేవించిన వారికి నుత్తమబుద్ధి లభ్యమగును. అధములఁ భజించిన వారికి నధమబుద్ధి జనించును. చంద్రకాంతమణి యందుఁ దనయాకార మెటులనుండిన నటులే ప్రతిఫలించి నటుల సదసత్పురుష సహవాసమున వారివారి గుణంబులు పట్టుబడును. కావున నుత్తముల సహవాసమే మంచిది ఎవరిని సేవించిన వారిబుద్ధియు గుణములు సంభవించును.

క. "త్యజదుర్జన సాంగత్యం
భజసాధు సమాగమ"మను భాషాగతుల
క్రజముగఁ జనుఁగ వినరే
యజస్రమును మనుజులిది యథార్థంబ కదా. ౧౦౯

తా. దుర్జన సాంగత్యము వదలుమనియు- సజ్జన సాంగత్యము చేయుమనియు- శాస్త్రములు వచించు మాటలు వినలేదా?

వ. కావున. ౧౧౦

తా. కాఁబట్టి.

క. అత్యంత సత్త్వగుణ సాం
గత్యంబున సాధుసేవ గలిగినఁగాలుం
గృత్యము లెవ్వియు నేటికిఁ
బ్రత్యయముగ దీనమత్సరం బెడ బాయున్.

తా. సత్త్వగుణమువలన సాధు సంసేవలభించి దానివలన మత్సరము నశించును ఇ
తర ప్రయత్నములకంటె సాధుసంసేవనకై ప్రయత్నించుటయే శ్రేష్ఠము.

క. ఈగతి నంతశ్శత్రుల
వేగమె నిర్జించి మదిని వేకము మైన స
ద్యోగాభ్యాస మునకు ను
ద్యోగము సేయంగవలయు నుడుగక యెపుడున్. ౧౧౨

తా. ఈరీతిగ నంతశ్శత్రువులగు కామక్రోధాదుల జయించి వివేక వంతుఁడై యోగాభ్యాసమునకును బ్రయత్నము సేయవలయును.

క. ఆలస్యంబున నూరక
కాలముపుచ్చంగ నెపుడు గవియునొ మృత్యు
వ్యాళంబని తెలిసిబుధులు
కాలము శివయోగ నిష్ఠఁ గడపఁగ వలయున్. ౧౧౩

తా. ముందు యోగమభ్యసింపఁ గూడదా? తొందరేమియని తలంచ కూడదు. "నిత్యస్సన్నిహితో మృత్యుః" అనువచనము ననుసరించి మృత్యురూపమగుసర్పము వెన్నంటియే యుండును. ఈసంగతి దెలిసికొని పండితులు తమకాలమును శివయోగ నిష్ఠయందే గడప వలయును,

క. మృత్యుసమమైన దుఃఖము
మృత్యుసమంబైన రుజయు మృత్యుసమంబౌ
నత్యంతభయము దేహికిఁ
బ్రత్యయముగ నెందుగలదె భావింపంగన్. ౧౧౪

తా. మనుష్యులకు మృత్యుసమమై నిత్యము జనించు- దుఃఖరోగ- భయముల-కంటె విచారింపఁగా మరొకటి భయంకరమైనది గలదా?

క. దారలు పుత్రులు మిత్రులు
నారాజ్యైశ్వర్యములును నాబంధములౌ
వైరగతినిది యెఱుఁగఁడు శ

రీతియుఁ దనుమృత్యు వశుహరించిన దాఁక. ౧౧౫

తా. భార్యాపుత్రులు- మిత్రులు-రాజ్యము-ఐశ్వర్యములు బంధములను విషయ మును, దన్ను మృత్యువునోటు వేసికొను నంతవరకు జీవులు కోరుచుండును.

క. భువిలోన నెవ్వరికి మృ
త్యువు చేరువయగును వానికూహింపంగా
వివిధమ్ములగు నరిష్టము
లవశ్యమును దోఁచు మొదల నవియెట్లనిన. ౧౧౬

తా. లోకమునందు మృత్యువు సమీపించిన వానికి నపశకునముల నేకములుగ లుగును. వాటినిప్రతిమానవుఁడుగుర్తింపవలయును.

—:అరిష్టలక్షణములు :—

సీ. దివిజ పథంబున ధ్రువుని శుక్రుని శని
చ్ఛాయ నరుంధతీ సతినిమాన
వుఁడు గాంచకుండు నేన్వఁడు వాఁడు మృత్యుసం
ప్రాప్తుఁడౌ నొకవత్సరంబు మీఁదఁ
గిరణ విహీన భాస్కరబింబమును గిర
ణావృతాగ్ని గనిన యానరునకు
మరణ మేకాదశ మాసంబు లరిగిన
నటమీఁదఁ గల్గు తథ్యంబుగాఁగ
తే. గీ. జనుఁడు కలలోననైన దృష్టమున నైన
రజతమును గాంచనమును మూత్రము పురీష
మును గరంబను బొందఁ గ్రక్కిన నతండు
నిధనమును బొందు నొకపది నెలలుచనఁగ. ౧౧౭

తా. ఆకాశమందున్న ధ్రువనక్షత్రము-శుక్రనక్షత్రము-శనినక్షత్రము- అరుంధతియు నేమానవునికి గన్పించవో, అతఁడొక సంవత్సరము బ్రతికితద్వాతఁ జనిపోవును. ఎవనికిన గ్నిజ్వాల కిరణములతోఁగూడి కొవ్వటులను సూర్యబింబము కిరణరహితముగనుగన్పించు నో, అతఁడు ౧౧మాసముల మీద మృతినొందును.

ఎవడు స్వప్నమునందు గాని, ప్రత్యక్షముగాని, బంగారము– వెండి-మూత్రము, పురీషము కన్గొనునో యాతడు పదినెలలుగడిచిన తరువాత చనిపోవును.

క. ప్రేత పిశాచ కనక వ్రా
తాతత గంధర్వపురము లాలోకించున్
భూతలమున నేపురుషుం
డాతఁడు నవమాసములకు నసువులు విడుచున్. ౧౧౮

తా. ఎవడు, పిశాచముల, ఉన్మత్తచెట్లను గంధర్వపురములను గాంచునో, అతఁడు తొమ్మిదిమాసములకు చనిపోవును.

తే. గీ. అరయఁగారణ మించుక యయిన లేక
బలము గలవాఁడు బడుగైన బలములేని
వాఁడు బలమైనఁ దెలియంగ వలయు వాని
బ్రతుకు నెనిమిది నెలలౌట భవ్యమతులు. ౧౧౯

తా. బలముగలవాఁడు, కృశించినట్టుల గాని, కృశించిన వాఁడంతకంటె కృశించినట్టుల గాని, యాకస్మికముగ కారణములేక నోచుచుండెనేని యాతఁ డెనిమిది నెలలకు మరణించును,

క. ఘనరేణు కర్దమంబుల
మునిఁగి తనదు రెండు పాదములు ఖండములై
యునికిఁ గనుఁగొన్న మర్త్యుఁడు
తనువు విడుచు నేడునెలలు దాఁటినమీఁదన్. ౧౨౦

తా. తానుబురదలోఁదిగబడినట్లును, తన కాళ్లు రెండును ఖండములై పడినట్లును కలం గాంచెనేని యాతఁడేడు నెల మీఁద మరణించును.

క. పసివడి గువ్వయు వాయస
మును గ్రద్దయు నాదియైన పులుఁగులు గడుగ్రొ
వ్వున నడుతల వ్రేసిన న
మ్మనుజుఁడు నెలలాఱుగాని మనఁడు ధరిత్రిన్. ౧౨౧

తా॥ గువ్వగాని, గ్రద్దగాని, కాకిగాని, మఱియే పక్షియైనను దనయడితలమీద ముక్కుతోఁ బొడిచినచో, అతఁడాఱుమాసములకంటె నెక్కువజీవించఁడు.

ఉత్సాహ వృత్తము

కపియుపాంసు వృష్టిచేతఁ గాకపంక్తిచేత మా
నవుని మస్తకస్థలంబునను దీవ్రబాధ యు
ద్భవము నొంద నైదునెలలు తనువు నిలయొండు లా
గవుట నాల్గునెలలునిల్గు నతఁడు వేయునేటికిన్. ౧౨౨

తా. పరాగవృష్టిచేతఁగాని, కాకిసమూహముచేతఁగాని దనతలకు (దీవ్ర)బాధ జనించినచో, నాతఁడైదు నెలలకంటె నెక్కువజీవింపఁడు. తననీడ గన్పించకున్నను, మఱియొక లాగు గన్పించినను, అతఁడు నాలుగునెలలకంటె నెక్కువకాలము జీవింపఁడు,

వ. వెండియు నరుండు రెండు మూఁడు నెలలలోన చెడిపోవు నవగత
మేఘంబైన యామ్యంబున మెఱుఁగును నింద్ర ధనువును నుదకం
బునఁ గనినను దైలాజ్య దర్పణాభ్యంతరంబులఁ దనరూపంబు త
లలేక తోఁచినను నొక్క మాసంబున జచ్చును. నిజశరీరంబు గొ
ఱియ గసురును, శవగంధంబును గలిగిన నర్ధమాసాయుష్యుండగు
స్నిగ్ధాడినపదతలంబును హృదయంబును నప్పుడయెండినను నీరుద్రా
వంగ నంతకంతకు దాహంబగ్గలంబైన దశదినంబుల దీఱు. కపిమా
సగతుండై దక్షిణపుదిక్కునకుఁ బాడుచుం జనంగఁ గనినట్లును గా
కసూర్యోంకుదయంబు సేయునెడ నతండొనిత్యైకై యెదురుగా నరు
గు, నెవ్వనికి నతిస్థూలిధ్వని నెలఁగు. ఇక్కొలియు నాఁటియుఁ బొ
డమునో. ఎవ్వనికి రేయుం బగలు భోజనము వొనరించు నప్పుడ మ
నంబున నూరక భయంబు పుట్టుచుండు వాఁడునుదంష ధరాలయాం
బున కేఁగనునాఁడొఁటి నిశ్చయంబు. ౧౨౩

తా, మఱియు నతండు రెండు మూఁడు నెలలలోపలనే చనిపోవచ్చును. మేఘములేక దక్షిణపు దిక్కున మెఱుపును గాని, యింద్ర ధనుస్సును గాని యుదకంబును గాని గాంచినను— నూనెయందుగాని, నెయ్యియందుగాని, అద్దమునందుగాని, తన యాకారము తలలేనిదై మొండెముగ గన్పించినను, అతఁడొక మాసములోపల (జచ్చును,

తనదేహమునందు గొబ్బి వాసనగాని, పీనుగవాసనగాని సంభవించిన వాతండు పదినైదు రోజులలోపల పరమగతిఁ జెందును,ప్రసవించిన పద్మస్థానము,హృదయమునప్పుడే యెండిపోయినను, తాగిన కొలది దాహమెక్కువ యయినచో నతఁడు పదిరోజులలో మృతి నొందును.

కోతిమీద నెక్కి దక్షిణపు దిక్కునకు ప్రయాణమై పోయినట్టుల నెవండు కలఁగనునో, సూర్యోదయమున నా సూర్యుండు తనకెదురుగాఁ బోవుచున్నట్టుల నెవనికిఁ దోఁచునో, మిక్కిలి భయంకర ధ్వని యెవనికి వినఁబడునో రాత్రింబవలు భోజన కాలంబుల మఱఁబున నెవనికి భయంబొంరక పుట్టుచుండునో, వాడు తప్పక యప్పుడే యమ నిలయంబునకేగుట నిశ్చయంబు.

క. వెలుచఁ బలుగొఱుకు నెవ్వఁడు
గలయు నెవఁడు తారకములఁ గానఁడు తనరూ
పిలలో నెవ్వఁడు వానికిఁ
గలయాయువు చెల్లుటెఱుఁగఁ గాఁదగుఁ బ్రాజ్ఞుల్. ౧౨౮

తా, ఎవఁడు బండ్లు కొఱుకుచుండునో, ఎవనికను గ్రుడ్లు తిరుగుచు లోనికి పోవుచుండునో, ఎవనికిఁ దనరూపము గన్పింపదో, అతఁడు మరణించుట నిశ్చయము.

క. గగనమునఁ గ్రహతారలు
పగలెవ్వఁడు గాంచు దేవపతి ధనువెవ్వాం
డొగిరాత్రి చూచు నాయువు
దెగుట నిజము వారలకు నతిత్వరితముగాఁ. ౧౨౯

తా, ఆకాశంబున శుక్రుఁడు బృహస్పతి మొదలగు నవగ్రహములను అనఁగా గ్రహసూచక ములగు నక్షత్రములను, పగలెవఁడు గాంచునో, రాత్రియందింద్ర ధనస్సు ఎవనికిఁ గన్పించునో, అట్టి వాఁడు త్వరలో మరణించును,

చ. అసితము వామలోచనము నంచు జలంబు స్రవించుచుండు నె
వ్వని కరయంగ ముక్కుతుద వంగుటగల్గి వికారమొందు నె
వ్వనికి ముఖంబు రక్తనిభ వర్ణము నాలుకమీఁద నల్పు నె
వ్వనికగు నాయువేమియును వానికిఁ జెల్లకపోవుఁ జయ్యనన్. ౧౩౦

తా, ఎవనికి నెడమ నేత్రమునుండి కన్నీరుగారునో, ఎవని ముక్కు కొంచెము వంగి వికారముగ గన్పించునో, ఎవని ముఖము రక్తమువలె నెఱ్ఱబడి పోవునో, ఎవని నాలుక

నల్పెక్కపోవునో, ఆతఁడపుడే చనిపోవుట నిశ్చయము.

క. కలలోన నుష్ట్రగార్దభ
ములఁబూన్చిన రథము నెక్కి పురుషుం డెవ్వాఁ
డల యామ్యదిశకుఁ జను న
క్కలుషంబున జీవితంబు గడచు నతనికిన్. ౧౨౮

తా. స్వప్నమం దెవఁడు గాడిదల చేతగాని, ఒంటెల చేత గాని, కట్టఁబడిన రథము నెక్కి దక్షిణ దిశకుఁ బోవు నటుల గలంగాంచునో; ఆతఁడు వెంటనే మరణించును.

క. తడఁబడఁ బ్రాతలఁ బడినం
గడువడిఁ దన్నెగయకుండఁ గప్పిరనుచు నే
ర్పడఁ గలగనిన మనుష్యుఁడు
తడయక జముప్రోలి కేఁగు దద్దయు బ్రీతిన్. ౧౨౯

తా. ఎవఁడు తడబడుచు, పాతరలోఁ బడి నటుల గాని, తాను లేవకుండఁ బైన పదిమందిచే నణచి వేసినటుల గాని, కలగాంచునో, ఆతఁడు యమసదనమున కేగును.

శా. కర్ణద్వారములందుఁ వ్రేళ్లనిలుపం గా మ్రోఁత లేకుండినన్
స్వర్ణాదిత్యుని భంగి నేత్రయుగళిన్ సంకర్షణజ్యోతి స
ద్వర్ణంబై చెలువొందకున్న నరుఁడున్ దృగ్గోలకా రక్త తా
పూర్ణ ప్రస్ఫుర మూర్ధ్వదృష్టి యయినన్ బొందున్మృతిక్లేశమున్.

తా. తన రెండు చెవులలో వేళ్లుఁ బెట్టి మూసికొని నపుడు లోపల ధ్వని లేక పోయినను, నేత్రములందు సూర్యునివలె గాంతి ఎక్కఁగా బ్రకాశింప కున్నను, కనుగ్రుడ్లు త్రిప్పుట గల్గినను, ఊర్ధ్వదృష్టి జనించినను, దప్పక యాతఁడు మృతిఁ జెందును.

తే. గీ. బొద్దులోఁతైన వదనంబుఁ బొందుదప్పి
శుష్కమైనఁ దాఁ గట్టిన శుభ్రవస్త్ర
ములు దనకుఁ జూడ నెఱ్ఱనైనఁ నలుపు నైన
విధము దోఁచిన నరుఁడు వేఁ వేగఁ జచ్చు. ౧౩౦

తా. తాను గట్టికొనిన తెల్లని వస్త్రము లెఱ్ఱవై తోచినను, నల్లనివైతోచినను, వె

టనే యతఁడు చనిపోవును.

క. ప్రకటంబుగ నిజభావ
ప్రకృతులు దలపోయ మగుడఁ బడువెసనెవ్వా
నికినది యవ్విపరీతము
తికినంత్యపుఁ గాలమరుగు దెంచుట జగతిన్. ౧౩౧

తా. ఎవనికిఁ దనభావమును- తనయాకృతియును, విచారింపగా మారిపోవునో, ఆతనికి సంత్యకాలము సమీపించినదని తెలిసికొనవలెను.

ఆ. వె. ఒక్కనాడి యందు యుడుగక వాయువు
నడచెనేని రెండు నాడులందు
మానవునకు సమము గాఁ జొచ్చెనేని
నతనియాయు వల్ప మంద్రబుధులు. ౧౩౨

తా. ఒకనాడియే వాయువుచేఁ జలించు చున్నటుల దోఁచినను, లేక నాడీద్వయమునందునో కేవిధమగు చలనము గలిగినటులఁ దోఁచినను, ఆతనికి వాయువు స్వల్ప మని గుర్తెరుంగ వలయును.

—— * కర్మ విచారము. * ——

ఉ. కావున నీయనిష్టముల కల్మష బుద్ధినెఱుంగ నేర్చిదుః
ఖావహ మృత్యునాశ కరమైన సదా శివయోగమున్ లస
ద్భావన నభ్యసించి యమృతస్థిర సౌఖ్యముఁ బొందుటొప్పునా
నావిధకర్మ పాశదళ నం బొనరింపుము సజ్జనావళుల్. ౧౩౩

తా. కాఁబట్టి సత్పురుషులు నానావిధములైన కర్మములను త్రాళ్లచేఁ గట్టుబడక వాటిని ముందుగనే తెలిసికొని నశింపజేసియిట్టి యనిష్టముల నాలోచించి సర్వదుఃఖాలయ మగుమృత్యువు వాతంబడ కుండునటులను- నిరంతరాభ్యాస వశంబున సదాశివయోగమును వశపరచుకొని శాశ్వతానందము ననుభవింపఁ బ్రయత్నించ వలెను.

శా. ఆలస్యంబును బోలుశత్రువును దధ్యంబెన్నఁ బ్రారంభముం
బోలంజాలిన బంధువుం గలఁడె యీ భూమిన్ సవింగానతా
నాలస్యంబొక యింతయైన మదిఁ జేయం జూడకుండ్యోగియై

వాలాయంబున యోగిగావలయు ని ◆ ర్వాణాను రక్తుండిలన్. ౧౩౪

తా. ఈజగంబున మానవుల కాలస్యము బోలు- శత్రువును- ప్రారంభము బోలు మిత్రుఁడును లేఁడు. కావున మోక్షాభిలాషగల మానవుతించు కంతయు నాలసింపక వెంటనే మహానురాగంబున శివయోగులు కావలయును.

క. యోగంబు నుభయకర్మ
త్యాగంబున గాకకలుగ ◆ దందు నవిద్యా
త్యాగమగున పుడమల వి
ద్యాగరిమము గలిగి యోగి ◆ యగునట మీఁదన్. ౧౩౫

తా. ఉభయకర్మములఁ ద్యజించినగాని, యోగి కానేరఁడు. ఉభయకర్మములనగా నజ్ఞానము- ఆలస్యము ననునవి. అందును నవిద్యా త్యాగము ప్రధానము. అవిద్య అజ్ఞానము నశించినచో నాలస్యముకూడ నశించును. కాన నజ్ఞాన నాశముచే విజ్ఞానము గలిగి యోగి యగును.

వ. అవ్విధం బెట్లంటేని. ౧౩౬

తా. అదియెట్టులనఁగ

గీ. క్రియగలుగు వానికంటెను ◆ గర్మిష్ఠుఁడుఁ గ్రి
యావిహీనుని కంటెను ◆ బావనుఁడును
నెందు లేఁడని తెలిసిన ◆ నిద్ధబుద్ధి
మహిఁ గ్రియా హీను గతినుండు ◆ మర్మమెఱిఁగి. ౧౩౭

తా. కర్మలాచరించిన వానికంటెఁ బాపాత్ముఁడును గర్మత్యాగికంటెఁ బుణ్యాత్ముఁడును ఎచ్చటను లేఁడని మర్మముగుర్తెరిగి క్రియావిహీనుఁడవు జ్ఞానివిధంబునఁ జరించుట సకలశ్రేయోనిధానంబు.

ఉత్సాహ వృత్తము.

కర్మమలిన మెపుడు మేన ◆ గల్గియుండ నెంతయున్
నిర్మలుండు నయిన యాత్మ ◆ నింగనంగ వచ్చునే?
మర్మమెఱిఁగి దర్పణంబు ◆ మలిన ముడుగఁ దోమఁగా
నిర్మలంబుగాక మున్న ◆ నీడగాన వచ్చునే. ౧౩౮

తా. ఎంతవరకు నీకర్మ మాలిన్యము గల్గియుండునో, అంతవరకు పరమాత్మను గాంచలేవు. అదియెట్లులనిన, మలినమగు నద్దమును నిర్మలముగాఁ జేయకుండిన దానిమాలిన్యమునందు ప్రతిబింబ మెటుల గన్పింపదో, అటులే కర్మ మాలిన్యమును జ్ఞానోదకమున శుభ్రపరచినగాని, జనులు పరమేశ్వరు ననుగ్రహ పాత్రులు కాఁజాలరు.

తే. గీ. ఉభయ కర్మంబు లెంతదాఁక । నుడుగకుండు
నొలియఁదాఁక నొకటిపో । నొకటిపొంది
యుండుదేహము గర్మముల్ । రెండు పోలియు
నపుడుగాదె శరీరక్షు । యావసరము. ౧౩౯

తా. కర్మద్వయ మెంతవరకు నశింపకుండునో, అంతవఱకు నొకటిపోయినను నొకటిదేహము నాశ్రయించియుండును. కావున గర్మద్వయము నశించినపుడే శరీర నాశనము యొక్క విచార మవసరమని తోచునుగదా?

తే. గీ. అపున రావృత్తి పదము । కర్మావలంబ
మునను సిద్ధించునది । మోహమునఁ గడంగి
కర్మముల కోరి సలిపెడు । కష్టజనులు
మూఢులని చాటు నాగమ । ములు ధ్రువముగ ౧౪౦

తా. ఏకోరికయుఁ గోరక యెవండీశ్వరార్పితముగఁ గర్మ లాచరించునో, వానికి మోక్షంబు సిద్ధించుట నిశ్చయము. అటులఁగాక కోర్కెలతో కర్మంబుల నాచరించెడి వారు మూఢులని యాగమములు ఘోషిల్లుచున్నవి.

తే. గీ. వ్రతములను దీర్థములను ను । పవాసములను
దేవపూజలఁ గర్మికిఁ । దీపిపుట్టు
సద్గురుఁడు గల్గెనేని ని । ష్కర్మికివియుఁ
జప్పనై యుండు వేయును । జెప్పనేల? ౧౪౧

తా. వ్రతములందేమి? తీర్థములందేమి ? ఉపవాసములందేమి? దేవతార్చనలందేమి? కర్మనిష్ఠగలవానికిఁ బ్రేమజనించును, నిష్కర్మికి సద్గురుఁడొకండు గల్గినఁజాలు. ఈకర్మలన్నియు నతనికిఁ జప్పగానుండును. అనఁగా రుచింపవని భావము.

క. కడగట్టిన కౌమోదపగిది

నెడయాసు క్రియాభియుక్తుఁ । డిట నిష్క్రియుఁడై
యొడిసెలను ఱాయి చనుకై
వడితత్త్వము గలయు బంధు । వర్గముతోడన్. ౧౪౨

తా. కర్మాభిలాషి ఓడస్తంభము గట్టిన యోడవలెమెల్లగా గమ్య స్థానముజేరును. నిష్క్రియుఁడు యొడిసెలనుండి రాయిరువ్విన శీఘ్రముగా నదిగమ్య స్థానము చేరునటు లంద్వవలో బంధుబృందముతోఁ గూడతత్త్వమున గలియఁగ లఁడు.

తే. గీ. పసిఁడి యినుప సంకలియల । భంగులైన
పుణ్యపాప కర్మంబులు । పొందకుండుఁ
గర్మియయ్యును జగతి ని । ష్కామ జన్ముఁడు
వనజపత్రము నీళ్లఁబొం । దని విధమున ౧౪౩

తా. ఎవండు బంగారమును నినుపసంకెల గాభావించునో, అతనిపుణ్య పాపంబు లంటు నేరవు కావునమానవులు కమలపత్రంబులందలినీటి బిందువులం బోలెఁ గర్మి యయ్యు లోకకళ్యాణకరివార్పణముగా నాచరించుచుఁ గర్మరహితునివోలెఁ జరింప వలెను.

క. ధర్మా ధర్మము లనియెడు
కర్మంబులు రెంటివలన । గట్టువడక ని
ష్కర్మ గతిఁజరించెడి యా
మర్మము సద్గురు కృపాస । మన్వితుఁ డెఱుఁగున్. ౧౪౪

తా. కావున ధర్మా ధర్మములను కర్మద్వయంబు నను గట్టుపడక నిష్కర్మమార్గ మునఁ జరించు మర్మమును సద్గురు కృపాపాత్రులగు వారలు తెలియగలరు?

సీ. శ్రీగురు కరుణాప్తి । శేషంబు గలిగియు
నజ్ఞాన తమమెల్ల । నణఁగదేని
నజ్ఞాన తమమెల్ల । నణఁగియు నిజతత్త్వ
మిదియని చూడంగ । నెఱుఁగఁడేని
తత్త్వసందర్శన । తత్పరుండయ్యును
సంశయంబులు విడ । జాలఁడేని
సంశయంబులు విడ । జాలియు నిహలోక

పరలోక సౌఖ్య విభ్రాంతుఁడే ని

తే. గీ భ్రాంతివిడిచియు సతతతీ। ర్థవ్రతోప
వాసజపహోమ పితృమేధ। వరసురార్చ
నాదికృత్యంబు లందు మో। హంబు గలుగు
నేనియెఱుకకు నిదిఫల। మేతలంప. ౧౪౫

తా. సద్గురు కృపగలిగినను నెవనికి నజ్ఞానము నశింపదో, అజ్ఞానము నశించినను తత్వమిది యనియెవఁడు గుర్తెఱుఁగఁడో, తత్వమును గన్నులార గాంచుచున్నను నెవనికి సంశయములు నశించవో, అవినశించినను- నైహికాముష్మిక భోగంబు లందెవండు భ్రాంతి నొంది యుండునో, భ్రాంతినివిడిచినను నెవనికిఁ దీర్థములందును- క్షేత్రము లందును- వ్రతము లందును- ఉపవాసము లందును- జపము లందును- హోమము లందును- దేవతార్చనాది కృత్యము లందును మోహంబుగలిగి వర్తించునో, ఆతఁడు ముక్తి నొందనేరఁడు. జ్ఞానము గలిగినను- నట్టివానికి సర్వము వ్యర్థము అనఁగా జ్ఞానవంతుఁడయ్యు- సర్వవిషయములు దెలిసియు- విషయవాసనా పీడి తుండయిన జనునకు సర్వము వ్యర్థమేయని భావము.

క, ఎడదవ్వుల రజ్జుశుక్తిం
బొడఁగని భుజగమును వెండి। బోలిచి మఱియే
ర్పడఁ గనుఁగొని తెలిసినకై
వడి మిథ్యా భ్రాంతి యుడుగ। వలయుందజ్ఞల్. ౧౪౬

తా. దగ్గఱగాని, దూరమందుగాని, త్రాడుచూచి పామనుకొనియు- ముత్యపు చిప్పనుజూచి వెండియనియు- తలంచి భ్రాంతినొందినను- దిరిగి యథార్థమును గనుగొనిన తరువాత నెటుల భ్రాంతిని వదలునో, అట్లే ప్రపంచ మందలి భ్రాంతివదిలి శివస్వరూపముగా నెఱుంగవలెను.

క. ఈక్షితిఁ గాశీక్షేత్రకు
రుక్షేత్రము లాదిగాని। ర్మోక్షములగు పు
ణ్యక్షేత్రములకు నరుగన
పేక్షింపు దురాత్మ తీర్థ। మెఱుఁగని వారల్. ౧౪౭

తా. ఆత్మతీర్థముల గుర్తెఱుఁగని వారైకొందఱు కాశీక్షేత్రమగు క్షేత్రములాదిగా

గలతీర్థంబుల నరుగ నపేక్షింతురు.

శా. అంతస్థంబగు నాత్మతీర్థము పరి। త్యాజ్యంబు గావించి వి
భ్రాంతిన్ బాహ్యనదీవిశేషములఁ। జెప్పన్ వించుఁ గ్రొళ్లించఁబో
నంతంతం దిరుగాడు వారలు వెసన్। హస్తస్థ రత్నంబున
ల్లంత న్వైచుచు గాజు పూసయెడ న। త్యాసక్తి గాటారయున్.

తా. తనలోన నున్న తీర్థంబుల వదిలి బాహ్యతీర్థమహిమలు వచింప ముదంబునఁ గాళ్లీడ్చుకొనుచు నంత వరకుఁ బోవుట- చేతియందున్న రత్నంబును పారవైచి గాజుపూసకై దిరుగుట గంటిదిసుమా?

చ. మకరము లాదిగాఁ గజల। మధ్యమునందు వశించు జీవజా
తికిని నభఃపథంబునన। తిత్వరితంబునఁ బాఱుపక్షి రా
శికిని జలాంబ రాంతర వి। శేషము బొందునె యెందునైన ఁబో
యక మఱియట్లకాదె తమ। యాత్మనెఱుంగని భ్రాంతచిత్తులున్.

తా. నీటియందు దిరుగు మొసలు- చేపలు మొదలగు జలజంతువులకును- ఆకాశంబునఁ బఱుగులెత్తెడి పక్షిజాలంబు నకును- జలాంబరాంతరముల విశేషంబులు దెలియనేరనియటుల- మానవులును- భ్రాంతులై తమయాత్మల గుఱ్ఱెఱుగ నేరకున్నారు.

క. ప్రియమలరగ ఁదీర్థంబులు
పయః ప్రపూర్ణములు దేవ। పరిసరము శిలా
మయ ములని బుధులెఱిఁగి ప్ర
త్యయముగ నీక్షింతు రాత్మ। సన్నియు పమునన్. ౧౫౦

తా. తీర్థములన్నియు పయఃపూర్ణములనియు- దేవళలందఱు శిలామయము లని యెఱిఁగియు పండితులాత్మ యందే యాన్నియుఁ గాంతురు.

తే. గీ. తానపటి కేగినను మఱికి। తానెవ్వాఁడ
యితరుఁడగ నేర్చునే జను। ఁడే విధమున
బుద్ధిఁ జూపంగ భావంబు। శుద్ధమైన
నఖిల తీర్థంబులును దన। యందు లేవె. ౧౫౧

తా. తానెక్కడికి వెళ్లినను బ్రజలందఱు తనను నితరునిగ జెప్పరు, తన పేరు కే- త

నయాకారమునే చెప్పఁబడుటుల- మనంబు పరిశుద్ధ మైనచో సమస్తతీర్థంబులును దనయందే గలవు. కానభావశుద్ధి యావసరము.

## —* శరీరతీర్థ వివరణము. *—

వ. అవిముక్త్యాది యనిన. ౧౫౨

తా. అవియే వివరణ.

క. అమరగ భ్రూనాసామ
ధ్యమమగుఁ గాశీస్థలము ప్ర ♦ యాగ యగుఁ హృ
త్కమలము శ్రీపర్వత ము
త్తమాంగమని చెప్పనగు గ ♦ దాతత్త్వ విదుల్. ౧౫౩

తా. కనుబొమలకు నాసికకును మధ్యనున్న స్థానము, కాశీక్షేత్రము. హృత్పుండరీకము ప్రయాగక్షేత్రము. శిరంబు- శ్రీశైలము. అనితత్త్వవేత్తలు వచింతురు.

క. అగుజ గతిలోఁగు శస్థల
ము గురుక్షేత్రంబు ఫాల ♦ మునుఁ గేదారం
బగు నంద్రు మఱియుఁ దీర్థము
ల గణితముగఁ దనువునంద ♦ యనయము నుండున్. ౧౫౪

తా. మఱియు- గుశక్షేత్రము గురుక్షేత్రము కేదారమును ఫాలంబున గలదు. అఫాల ప్రదేశమే శైవక్షేత్రములుగఁ జేర్కొనఁ బడినది. తక్కిన తీర్థము లన్నియు నిటులనే యాత్మయందే గలవు.

ఆ. వె. అరయ నిట్లయగుట ♦ యాత్మ తీర్థము విస
ర్జించి బాహ్య తీర్థ ♦ సేవ సేయఁ
గోరి భ్రమసి తిరుగు ♦ కుమతుల నేమనఁ
గలదు దీనిఁ దెలియ ♦ వలదె బుధులు. ౧౫౫

తా. కావునవిట్లు విలసిల్లెడి యాత్మతీర్థంబుల వదలిబాహ్య తీర్థంబుల కాంక్షించి తిరుగు కుమతుల నేమన వలయును?

క. జనుఁ డీట్టిదె కావున భ్రాం

తిని పీసీత బుద్ధినన్య ♦ తీర్థములాడన్
జనకతన యాత్మఁగడు శా
వనుఁడని సందేహముడుగ ♦ వలయును బేర్మిన్. ౧౫౬

తా. జనులాత్మ యందలి తీర్థంబుల గుర్తెఱిఁగి భ్రాంతులై యన్య తీర్థంబులపాం ఛఁబోక తనయాత్మయె మిక్కిలి పవిత్రమైనదని తలంచి సంశయములుడుగ వలయును.

——* కర్మయజ్ఞ దూషణము. *——

క. శ్రుతిచెప్పెడి నవిభ్రమమై
క్రతువులు సేయుదురు మోక్ష ♦ కాంక్షను హింసా
యుతియని తలఁపరు తమతమ
మతిలోపలఁ గొందఱిట్టి ♦ మాయయు గలదే. ౧౫౭

తా. వేదములు చెప్పిన వనిభ్రాంతితోఁ గొందఱు మోక్షకాంక్షులైయాగములుచేయుదురుగాని, అదిజంతుహింసాకరమని కొంచెమును దలంపరు గదా? ఆహా!యిట్టి మాయయెందైన గలదా?

శా. యాగంబుల్ నిగమోక్తమైఁ జలిపి దే ♦ హాంతంబు నన్నాకలో
కాగారంబున నుండుఁ గొంతదడవ ♦ త్యంతోత్సవ ప్రాప్తుఁడై
వేగంబారఁగఁ గ్రమ్మఱి న్నగిఁ యు ♦ ర్విం బుట్టునానాక్రియల్
రాగద్వేషముఁ బొంది సేయునపవ ♦ ర్గాబేగతిం గల్గునే. ౧౫౮

తా. వేదముచెప్పిన చొప్పున యాగంబు లొనర్చియు దేహాంతమున గొంత కాలము వఱకు స్వర్గలోకంబున నుండిభోగంబు లనుభవించితిరిగి భూమియందు జన్మించి నానా కర్మలకు లోనై రాగద్వేషములను వలయందుఁ జిక్కి కొని తిరిగి జన్మపరంపర ననుభవింప వలసినదేగాని మోక్షమేగతిని వారికిఁగల్గును? అనఁగా మోక్ష మెప్పటికిని వారికిఁ గల్గదనియే కవిహృదయము.

ఉ. అక్కట నిర్దయుం బశువు ♦ లంచున నాధలు మేఁక పోతులన్
స్రుక్కక చంపి నంజుడులు ♦ సొక్కుచు నిక్కుచుఁ దిందురెల్లడన్
గ్రక్కున నట్టి మేఁకలకు ♦ గోలను గూసిన నెట్లఁ గాక వా

రెక్కడగ మోక్షసౌఖ్యమది । యెక్కడఁ జిత్తమునందలంపఁగాన్.

తా. అయ్యో! దయావిహీనులై పశువులని మేకపోతులను గొందఱు జంపుచు మాంసమును దినుచు- సోమయాజులమని నిక్కుచుందురు గాని, వారికిమోక్ష సుఖంబిం చు కంతయులేదు సుమీ? నిజము విచారింపఁగా నామేకలకుఁ గాలము మూడి రోగు టయేగాని, వీరికిమోక్ష మొసగుటకై చనుటగాదు.

తే. గీ. కర్మబీజాబు సంకల్ప । కలనమునన
యంకురింపుచు నంతంత । నతిశయిల్లు
నది యసంకల్ప మనుకుఠా । రాహతినిజ
వముదలిర్వంగ ఖండింప । వలయుమొదల ౧౬౦

తా. కర్మయను విత్తనము సంకల్పమున నంకురింపుచు మహావృక్ష మగును గాన దానిని బ్రాజ్ఞులా సంకల్ప రాహిత్య మను గండ్ర గొడ్డలిచే మొద లంట నరికివేయ వల యును.

—* జ్ఞానయజ్ఞ ప్రాశస్త్యము. *—

తే. గీ కర్మమెల్లను భోగైక । కారణంబు
జ్ఞానమెల్లను మోక్షభా । జనమె యగుట
కర్మయజ్ఞంబు వలని యా । కాంక్షలుడిగి
సతతె విజ్ఞానయజ్ఞంబు । సలుపవలయు. ౧౬౧

తా. కర్మయంతయును భోగముల కొలయము. జ్ఞానమెంతయును మోక్షమునకుదావు. కావున కర్మయజ్ఞంబు నందలి యాశపదులుకొని నిరంతరము విజ్ఞానయజ్ఞము చేనవలంబింప వలయును.

చ అరయఁగఁ ద్రాడుపామనిభ । యంబును బొందినమాత్రలో విషం
బరుమగ నెక్కుఁజామైనన్ నాత్మఁగలంగక త్రాడుగాక నాఁ
బారయదు తద్విషంబును బ్రబ్ బుద్ధను నిట్లగుఁ గర్మకోటులన్
సగబారయండ కర్మఫలన్ శంకవహింపమిఁ జేసియెత్తఱిన్. ౧౬౨

తా. త్రాటెని జూచిపామని భయంబు నొందినచో, విషం బెక్కుట నిశ్చయము

ర్తాదు గాక పాపమైనను మనంబున భయంబు నొందనిచో నిహ బాధ యుండునా? క
ర్తకోటులందరి కర్మ ఫలం బనుభవింప గోర మిచేత జ్ఞానితోఁ దుల్యుఁడెందును గాఁ
బడఁడు.

క. వేయేమి న్యాయమువోవక
యేయాయాసమును లేక హింసాక్రియలు
జేయక యుండఁగ మోక్ష
శ్రీయొందుఁ జ్ఞానమఖముఁ జేయఁగవలెఁ.

తా. ఆయాసమును మాత్రమునులేక, హింసాకర్మములఁ బరిత్యజించి జ్ఞాన యోగ
ము చేసినవారికి మోక్షముసులభముగా లభించును.

వ. అదియెట్లంటేని. ౧౬౪

తా. అదియెట్లు లనఁగ.

చ. అరయఁగఁ జిత్తబుద్ధులు న హంకరణంబును గూర్చిబుత్విగా
వరణముఁజేసి యల్లప్రణ వంబొక యూపముఁజేసి యింద్రి యో
త్కరమును బ్రాణముల్ పదియు గాపశుసంతతి గాన నాహతస్ఫు
రదురుమంత్రఘోషణము పొంగుచునింగిఁ జెలంగిమ్రోయఁగాఁ.

మత్తకోకిల
సేమమార విశుద్ధచక్ర శ శిస్థలంబుల మధ్యముఁ
హోమకుండముఁ జేసియందలి జ్యోతిలోపలఁ దత్పశు
స్తోమముం దగవేల్చి యంతట సోమపానముఁ జేసి ని
ష్కామభావన సోమయాజియు గాఁదగుఁ సుజనుండిలఁ. ౧౬౫

తా. మానవులు- చిత్తము- బుద్ధి-అహంకారములను మూడింటిని బుత్విజులనుగా
గావించి ప్రణవమును యూపస్తంభమును జ్ఞానేంద్రియ సమూహము- దశప్రాణ
ములను- పశుసంతతిగా నొనర్చియనాహత చక్రమున మంత్రధ్వనులు మిన్నుముట్టు నటు
ల మ్రోయుచుండ, విశుద్ధచక్ర శశి స్థలములమధ్య హోమకుండము దీసియచ్చట వెల్గుచు
హోజ్యోతిలోఁ బైపశు సంతతిని వేల్చినిష్కామ భావన సోమపానమును జేసిసోమయాజు

లై మెలంగవలయును. అట్లుగాక కేవలపశుయాగము లొనర్చువారిని సోమయాజు లనిచెప్పవచ్చునా?

క. ఏమతమును గాదని మఱి
యీమతము పరిగ్రహించి యెలమిఁ జెలువఁగా
శ్రీమెఱయు జ్ఞానయజ్ఞం
బేమియు సందియము వలవ దిచ్చును ముక్తిన్. ౧౬౭

తా. అన్నిమతముల వదిలి యీశివయోగుల మతమును స్వీకరించి ప్రేమచే జ్ఞానయజ్ఞం బొనర్పఁ దప్పక ముక్తి గలుగును.

క. నానావిధముల నిట్ల
జ్ఞానముఁ దలఁగింపఁగా నిజంబారఁగ సు
జ్ఞానంబొడగూడును సు
జ్ఞానముదక్కఁగ మోక్షసౌఖ్యముగలదే. ౧౬౮

తా. అనేక విధములుగా నున్న యజ్ఞానము పోఁగొట్టించిన గాని సుజ్ఞానము గలుగనేరదు. అట్టి సుజ్ఞాన ప్రాప్తికంటె మోక్షసుఖము వేఱుగఁ గలదా?

సీ. సల్లలితజ్ఞాన వల్లరీజాలంబు
నెట్టనదట్టమై చుట్టుకొనఁగ
సదమలంబగు సూరిజనవాక్ప్రసూన సం
శోభిత గంధంబు సుడియుచుండఁ
బరిపక్వ ఫలములఁ బ్రాలిన యాగమ
వేదాంతశాఖలు వినుతికెక్క
పడమటఁ బఱతెంచు కడుచల్లనగుగాలి
మొయివచ్చు నమృతంబు మేసఁజిలుక
తే.గీ. రహ్యతరతత్త్వసంజ్ఞ కారామభూమి
జలనలేనిసమాధి యాసనము గాఁగ

నున్నతానంద మయవృత్తి నునుటొప్పు
నెన్నియుక్తులు నీయుక్తి కీడుగావు. ౧౭౯

తా. ముప్పదియారు తత్వములచే (బ్ర)కాశించు చక్కని యుద్యాన వనమున సుజనులు- నిర్మలము- నిశ్చలవమునగు సమాధి నిష్ఠచే యోగ ముపాసించవలెను. ఆయారామ భూమియందు నాతప బాధలు లేకుండ జ్ఞానలతల సమూహము దట్టముగా వ్యాపించి యున్నది. పండిత జనుల వాక్కులను పుష్పముల వలన గుప్పుగుప్పుననే తెంచుమంచి పరిమళమాతోట యంతంతటను వ్యాపించి యున్నది. బాగుగాఁ బండిన ముక్తిఫలంబులచే నేలమీదకు వ్రాలిన ఆగమములు- ఉపనిషత్తులు- అనుకొమ్మలచే నాయుద్యానము విలసిల్లు చుండును. పడమటి నుండి వీతెంచు గాలితో వచ్చెడి యమృత బిందువులు శరీరము నందు హాయిని గొల్పుచుండును. కావున నిట్టి యుద్యాన భూమియందు నిశ్చల సమాధి మగ్నుఁడై నిర్మలానందమున నుండుట తగును. ఎన్నిమార్గము లితరము లున్నను- దీనికిఁ దుల్యములు గావు.

వ. ఇత్తెఱంగున. ౧౮౦

తా. ఈవిధమున.

క. శివయోగంబగు నంతకు
నవిరతము నకామవృత్తి నర్హంబగు క
ర్మవితానము సేయుచు నది
శివార్పణము సేయునది వి శేషము జగతిన్. ౧౮౧

తా. శివయోగ సిద్ధిగలుగు నంతవఱకు నిష్కామ బుద్ధితో గర్మలనాచరించి శివార్పణము చేయవలయును.

వి. ఇందువలన గవి యభిప్రాయము యోగసిద్ధి తర్వాత గర్మమార్గము నిష్ప్రయోజన మనియు- అది యుండినచో జన్మపరంపరకు హేతుభూతమనియు- గావున శివయోగసిద్ధి గలుగు నంతవఱకుఁ గర్మాచరణము ముఖ్యమై నటులను దోచుచున్నది.

క. ప్రవిమల సత్కర్మసవహా
మనశ్యముగనునుగవలవ దట యోగాభ్యా
సవిధికరిన నొందుగకును ని

రవకాశత నదియెయుసుగు నందాకనుగీ. ౧౭౨

తా. కర్మసమూహమును- యోగా భ్యాస కారణమునఁ బరిత్యజింపఁ గూడదు.త మంత తామే యాకర్మలు నశించి పోవలయును. అనఁగాఁ గర్మయే దన్ను వదిలి పోవ్ల యును గాని, అంతవరకుకు దాను మాత్రము గర్మను విడువ గూడదు.

క. బ్రహ్మము నిజమెఱుఁగక హం
బ్రహ్మంబని సత్క్రియలకును బాసినకర్మ
బ్రహ్మాభయ విభ్రష్టుకు
బ్రహ్మాండములోన నిహప రంబులుగలవే. ౧౭౩

తా. బ్రహ్మమన నెవరో యెఱుఁగక నేనే బ్రహ్మనని వీఱ్ఱవీగుచు- నటుబ్రహ్మసా క్షాత్కారములేక ఇటు కర్మాచరణములేక యుభయ భ్రష్టులైన వారికి బ్రహ్మాండమునం దెచ్చటనైనను- ఐహిక సుఖముగాని, యాముష్మిక సుఖముగాని గలదా?

క. కర్మములు గోరిసలుపుచుఁ
గర్మఫలానుభవ శంక గదురుచు వెలి ని
ష్కర్మిననుచుఁ గేవల స
త్కర్మముఁ బెడఁబాయు పాప కర్మియుఁ గలఁడే. ౧౭౪

తా. తానుబుద్ధి పూర్వకముగ గర్మల గోరిక లీక లెత్తి నాచరించుచుఁ గర్మఫ లమను భవించ వలయుననను సంశయముననఁ బాహ్యమున నేను నిష్కర్మిని- యని వచింపు చు- సత్కర్మల దూషించుట సజ్జనుల ధర్మముగాదు.

క. క్రమమునఁ దరుఫలముల బ
క్వములు నులిచి త్రెంచి వైచు కరణి మనఃపా
కము గాకమును శిఖాసూ
త్రములు విడుచు పాపకర్మిఁ దడవఁగఁజనునే. ౧౭౫

తా. వృక్షమునందలి బాగుగా పండిన ఫలంబుల, ద్రెంచు విధంబున మనఃపరిపా కము గదిరిన తర్వాత శిఖాసూత్ర పరిత్యాగము చేసిన చేయవచ్చును; గాని, మొదలే శి

భా సూత్రములు త్రెంచి వేయుట పాపాత్ముల చేయదగిన వలయునో దోచకున్నది. దేహము న్నంత వరకుఁ బ్రారబ్ధ ముండుట చేతను, ప్రారబ్ధ మవశ్య మనుభవింప దగినది యగుటచే తను. మఱి పరిపాకము గుదురుట దుర్లభమని తోచుచున్నది. అందు వలననే శిఖా సూత్ర పరిత్యాగమును వెంటనే చేయఁగూడదు.

చ. అలవడ భూసురప్రవరుఁ డాదిగ నంత్యజుఁ డంతమైన వా
రలయెడ నొక్కరూపు గఁని రంబుగఁ జూడక యున్న కీర్తియుం
గలిమియు నాశ సేయక సుఖంబునఁ జెందక యున్న సత్క్రియల్
దలముగఁ జేయ లేక మతి దప్పిన సోమరిఁ జెప్ప నేటికిన్. ౧౨౬

తా. బ్రాహ్మణుఁడు మొద లంత్యజుని వరకుగల సర్వమానవులను. సమానముగఁ జూడక, కీర్తి సంపదల యపేక్ష వదలక సుఖమును పరిత్యజింపక ముందే కర్మల పరిత్యజించుట సోమరి పోతుల లక్షణము.

క. కావునఁ బాపప్రోవలఁ
బోవక నిగమోక్త ధర్మములు నిజశక్తిన్
గావింపుట యొప్పు నిస్పృహా
భావంబున నదియ ముక్తి పథమండ్రు బుధుల్. ౧౨౭

తా. కాఁబట్టి దుష్టమార్గముల నవలంబింపక నిగమాగమోక్త ధర్మముల శక్తి కొలది నిష్కామ బుద్ధితో నీశ్వరార్పితముగా నొనర్ప వలయును, అటు లాచరించుట యముక్తి మార్గమని పండితులు వచింతురు.

తే. గీ. తానొనర్చిన పుణ్యంబుల్ తన్ను మనుచు
దానొనర్చిన పాపంబుల్ తన్నుఁ జెఱచు
గానితను మన్పఁ జెఱుపం గఁగర్త లెందు
నెవ్వరును లేరు జనులిదియెఱుఁగ వలయు. ౧౨౮

తా. తాను జేసిన పుణ్యములు తన్ను రక్షించును. తాను జేసిన పాపములు తన్ను నశింపఁ జేయును. తన్ను గాపాడుటకు గాని, చెఱుపుటకుఁ గాని, మానవు లెవరును గర్తలు కారని తెలిసికొని రూఢిగా నమ్మవలయును.

——◆ జగత్కర్త యీశ్వరుఁడని నిరూపించుట ◆——

క. కనుఁగొనఁ బ్రాపంచికమున
కనయమునీశ్వరుఁడు కర్త యైయుండఁగ లేఁ
డన నెట్లువచ్చు భాట్టుల
యనవున సదసద్వివేక హానియగుఁగదా. ౧౨౯

తా. విచారింపఁగ నీ ప్రపంచమున కంతయు, నీశ్వరుఁడు కర్తయై యుండఁగా భాట్ట మతస్థులవలె లేఁడని చెప్పుట తప్పు సుమా?

క జగదీశ్వరునకుఁ బగయును
మొగమోటయు లేదు నరులు మొగిఁ జేసిన క
ర్మగతిని శుభాశుభంబులు
దగిలియనుభవించు చోటఁ దా సాక్షియగున్. ౧౩౦

తా. జగదీశ్వరుఁడగు నాపరమేశ్వరునకు మొగమోటము యనఁగా వీరు నా బంధువులని ప్రేమగాని, వీరు నా శత్రువుల నిద్వేషము గాని, లేదు. జీవులు తమతమ పూర్వకృత కర్మ వశంబున శుభాశుభ కర్మల ననుభవింతురు. అట్టిచోఁ బరశివుఁడు సాక్షీభూతుఁడు గానుండును.

వ. ఇట్లు భాట్టులు కర్మంబ సుఖదుఃఖకారణంబు గాని పరమేశ్వరుం డనంగ నొక్క నియామకుండు లేఁడండ్రు. అది యబద్ధంబు. ద్రోహంబు చేసిన వానికి ద్రోహంబు సంకలియయ్యై వచ్చునే. అసంకలియ పెట్టించెడికర్త యొకఁడుగలుగుఁగాక. హితముఁ జేసినవానికి నాహితంబ యాందోళికా ఛత్ర చామరాదులై నడచి వచ్చునే. యవికర్త్రధీనంబులై వచ్చుఁగాక. కావునదదీయమతంబ యుక్తంబు. జీవాత్మ వాదులు కొందఱు జీవ స్వాతంత్ర్యంబుఁ జెప్పుదురు. వారలనజ్ఞులని తెలియవలయును. ఎట్లనిన జీవుండు ప్రారంభించిన పనులెల్ల ఫలించుననిఁ జెప్పవచ్చునే?. యొకానొకచోట ఫలియించుట గలిగిన జాత్యంధుండు తెరువు నడుచుచు నొక్క మూలు తెరు

పుడప్పుడు నొక్కమాఱు తెరువున వచ్చునట్లు, కీటకంబు భ్రమాను
దోలుచునప్పు డొక్కొక్కచోట నక్షరాకారంబైన యట్లు, జీవా
త్మ కర్తృత్వంబు నని తెలియునది. జీవాత్మయిదు పశువనం జను.
తత్పతియైన పరమేశ్వరుండు పశుపతియనందగు. బశువులకుఁబతిరు
ద్రుండను శ్రుతి ప్రమాణంబు గలిగియుండు, నెట్లనిన-పశుపతినా
మంబునంగల షష్ఠీతత్పురుష సమాసంబుతోఁ గూడ శ్రుతి నను
స్మరించుటం జేసి "అత్రవేదాః ప్రమాణం" బండ్రు. గావున నిట్టి
జీవజ్ఞానంబు వైదిక మతంబై ప్రవర్తిల్లు నదియు నుం గాక, యు
త్పత్తి వేళఁబశుపతి తాన భవనామ రూపంబున స్రష్ట ప్రజాపతి
కాలసమస్త భూతంబులకు నంతర్యామియై రజోగుణంబుతోఁ
గూడి సృజియింపును, స్థితి యందు మృడ రూపంబున మనుప్ర
భృతుల ముఖంబున ధర్మశాస్త్రంబులు రచియించి సత్పథంబునా
పించి విష్ణునామ కాలభూతాదులకు నంతర్యామియై సత్త్వ గుణంబు
తోడం గూడి రక్షించును. సంహారంబునందు హరరూపంబున రు
ద్రాగ్ని సూర్యాంతక కాలభూతంబులకు నంతర్యామియై తమో
గుణంబు తోడఁగూడి సంహరించు నీత్రిగుణంబులు నతిక్రమించి శి
వస్వరూపంబు నందును నాశ్రయించిన సర్వదుర్లక్షణదూరులు
ను సర్వసులక్షణ సంపన్నులును సంతత సంతృప్తి సహితులును
నూర్ధ్వ రేతస్కులును నిత్యముక్తులును నిజభక్తులునగు సనక సనం
దన సనత్కుమార సనత్సుజాతాదులకు నంగుష్ఠ ప్రమాణ దేహు
లగు వాలఖిల్యాదిసిద్ధులకును శుక వామదేవాది శుద్ధులకు నంతర్యా
మియు ధ్యేయుండును నై పరమానంద ప్రదాయకుండగుచునుండు
నిసి చతుర్వ్యూహంబులనందగుఁదాన సృజియించిన సృష్టిలోఁ గొం
దఱిని దుఃఖ సంసారులను, గొందఱి సుఖ సంసారులనుగా సృజియించిన
పశుపతికి వైషమ్య నైర్ఘృణ్యంబులు ప్రాప్తంబులు గాకుండునే? య
నినఁ దత్పశువుల పుణ్యపాపాభిమానంబులు కారణంబులుగాఁ జేసి
చూచుచు వినోదించుచుండు నెట్లనిన:- పారావత శుక శారికా

దులం బెనిచి తద్వినోద సుఖంబులం బొందు నొకానొకపుణ్య
పురుషుండునుం బోలె నానావిధ గోమహిషాది పశువులఁ గాఁడి పిడిబ
లువగు రజ్జువులం గట్టి కసవు నీరమ్ము యెడలాబెట్టి రక్షించుచుఁ
దనకు వలసినపుడు పిదుకుచు నుండు గోపతియుం బోలె, నానా
విధ పశువులం బుణ్య పాపాభిమాన పాశంబులంగట్టి సుఖదుఃఖం
బులను గ్రాసంబుఁ బెట్టి యందులోనం దనదు కటాక్షవీక్షణంబు
లెవ్వరిపయిం బొలసె నప్పుడు వారలఁ బాశ బంధముక్తులుగాఁ జే
యుచు జగత్ప్రవర్తనంబు లీలయుం బోలెం జలుపుచు సుఖించుచుం
దనకు నరిషడ్వర్గ షడూర్మి పంచకోశ షాట్కౌశిక తాపత్రయాగు
ణత్రయాదులు గలుగక పిపాసోఁడా సూచిన జగన్నాటకంబునకుఁ
బానొక్కండు సాక్షియు నిర్లేపియునై నిత్యతేజో నిధానంబై బ్ర
హ్మవిష్ణు రుద్రమహేశ్వర సదాశివాద్య నాది నాద బిందు కళాది
తత్త్వాతీత సంజ్ఞ కుండై షట్త్రింశత్తత్త్వాధి కుండునని చెప్పం
దగి పరశివ బ్రహ్మంబగు పశుపతికి వైషమ్య నైర్ఘృణ్యంబు లేల
కల్గు నట్లుగావునఁ బసుపతియైన పరశివుండు ముముక్షువుల కెల్లను
పాస్యుండనుట సకలవేద శాస్త్ర సిద్ధాంతంబు. ౧౮౧

తా. భాట్ట మతస్థులు, కర్మమే సుఖప్రాప్తికిని దుఃఖప్రాప్తికిని కారణముగాని, తద
తిరిక్తముగ దేవుండు వేరే లేఁడందురు.

జీవాత్మ వాదులు జీవుఁడే స్వతంత్రుఁడు గాని, యతని కంటె మరొకఁడు కర్త
లేఁడందురు. కాని విమర్శింపఁగా నీరెండును నసంగతములే.

ఒకఁడు దొంగతనము చేసిన వాఁడని యనుకొనుడు. అందునష్టముగా వచ్చిన ని
రువురిని జంపెనని యనుకొనుడు. ఇట్టుల మహాపాప మొనర్చిన నతనికి ప్రభువు రక్షక
భటులఁ బంపి సంకెలల వేయించి కారాగృహమున బడవేసి దుఃఖము గలిగించుచున్న
ఆతని పరమాత్మ రూపమైన పాపమతనిని మరలనట్టి దుష్కార్యంబునకే పురికొల్పి
సంతోషంబును గల్గించును గాని యాదుష్కార్యము నుండి మరలించి దుఃఖంబును గలిగిం
చునా? లేదు.

ఒకరాజు నదిలోఁబడి కొట్టుకొని పోవుచుండఁగా నొకఁడు మహాశ్రమపడి యా

దుకొనిపెళ్లి తనప్రాణమును రక్షించుకొనుచు సతినిగూడ బ్రతికించి వాఁడని యనుకొనవ లదు. అతఁడొనర్చు సహాయమాతనికి బహుమతులఁ స్వయముగ జేయఁగలదా? లేదు. రాజుచేత సతినికిఁ గావలసిన వస్తువుగాని, చివరకు నర్ధరాజ్యముగాని యిప్పింపగలదు. కావున పుణ్యపాప రూపములగు కర్మము లెన్నటికి సుఖదుఃఖములు కలుగఁ జేయవు. ఆపుణ్యపాపముల విచారించి శిక్షింపను రక్షింపను బరమేశ్వరుఁడు వేరే యొకఁ డున్నాడని లంచ వలెను. కర్త లేకయచేతనములగు పాపపుణ్యములు సుఖదుఃఖములను స్వయముగాగ లుగ జేయువని భావము.

జీవుఁడు గూడ స్వతంత్రుఁడు గాడు. అయినచో జీవుఁడు చేసిన పనులకొన్నిఫలమంతము లగుటలేదా యని యనవచ్చును. నిజమే. పుట్టు గ్రుడ్డు మార్గమున నడుచుచు మార్గము దప్పినొకప్పుడు తనమార్గమున వచ్చునటులను, వజ్రకీటకము, కొయ్య తొలుచుచు నొకప్పుడ క్షరాకారముగ దొలచునటులను జీవుండొనర్చునవి యాకస్మికముగ నొకానొకటి ఫలించును. అంతమాత్రంబునఁ గర్త గాఁడు.

జీవులు- పశువులు. పశువుల కధి పతి యగుటచేఁ బశుపతియని పరమేశ్వరునకుఁ పేరువచ్చినది. ఈవిషయమై వేదములు ఘంటా ఘోషముగా వచింపుచున్నవి.

పరమేశ్వరునకుఁ జతుర్వ్యూహములుగలవు. హర- భవ- మృడ- శివ నామములచే నొప్పారు. పశుపతి యగు పరమేశ్వరుడు ప్రపంచోత్పత్తి కాలంబున ప్రజాపతి మొదలగు సమస్త భూతాంతర్యామియై భవరూపంబున సృజింపుచుండును. విష్ణువు మొదలగు సర్వభూతముల కంతర్యామియై మన్వాదులచే ధర్మశాస్త్రముల రచింపించి సన్మార్గము నేర్పరచి మృడరూపంబున రక్షింపుచుండును. రుద్రుడు- సూర్యుడు- అగ్ని, యముడు, కాలము, భూతములు, అనువానియందు దనశక్తిని నుంచి తమోగుణంబున హరరూపంబున సంహరించుచుండును. త్రిగుణాతీతుఁడై శివస్వరూపంబున నిత్యముక్తులగు సనకసనందనాది మునీంద్రులకును, బొటనవ్రేలంత ప్రమాణము దేహముగల వాలఖిల్యాది సిద్ధులకును, సుప్రసన్నుండై యుండును. ఈవిధముగఁ బశుపతియే సర్వప్రపంచమునకుఁ జతూరూప భేదంబున నడిపించుచుండును.

పరశివుఁడే జీవప్రపంచమును సృజించెను గదా? అతనికింత పక్షపాతంబేల? కొందఱిని సుఖవంతులగను, కొందఱి దుఃఖవంతులగను జేయనేలయని సంశయము గలుగ వచ్చును. కాని, దానికి జీవులుచేసికొను పుణ్యపాపములే కారణముగాని పరమేశ్వరుఁడు కాఁడని తెలిసికొన వలెను.

ఆయీశ్వరుఁడొక పశుపాలకుఁడు. పశుపాలకు డెటులగోవృష భాదులకుఁ దృణం

బువేసి నీరువెట్టి త్రాళ్లంగట్టుచు, దనకుఁ గావలసి నప్పుడు విడుచు చుండునో, అటులే స ర్వేశ్వరుఁడు జీవులను పాశంబులను త్రాళ్లబిగించి పుణ్యపాపములను గడ్డినివేసి తనకటాక్షు మెవనిపైఁ బ్రసరించునో, వానినప్పుడు బంధముక్తులుగాఁ జేయును. గాని,సర్వజను లసుఖ దుఃఖంబులు స్వకర్మ కృతంబులు గదలంచి పరమేశ్వరు నిందింపక యనుభవించుచు తద నుగ్రహాభిలాషిమై నిరంతరం బర్చించు చుండఁ వలయును.

ఆపరశివునికిఁ గామక్రోధలోభ మోహమద మాత్సర్యములను నరిషడ్వర్గములేదు. ఆకలి, దప్పి,జర, మరణము, శోకము, మోహముఅనుషడూర్ములు లేవు. అన్నమయ ప్రాణ మయ, మనోమయ విజ్ఞానమయ, ఆనందమయ ములను పంచకోశములు లేవు. షట్కోశ ములుగాని, తాపత్రయములుగాని, ఈషణత్రయములుగాని యాతనికిలేవు. ఇవి యన్ని యీ జగంబునకుఁ గలవు- దీనికి సాక్షీభూతుఁడై తేజోరూపుడై బ్రహ్మవిష్ణు రుద్ర మ హేశ్వర సదాశివా ద్యనేక నామంబులు గలిగి మహిత్త్వశక్త్యాధికుడై ముముక్షువు లకెల్ల నాతఁడుపాస్యుడై యుండు. ఇదిసమస్త శాస్త్రంబులందుసిద్ధాంతముచే యఁబడినది.

తే. గీ. మోక్షసుఖమట్టి శివయోగ ౯ మునసుదక్క-
నెట్టిక్రియలను లేకుండు ౯ టెఱిగి బుధులు
సర్వధర్మోత్త మంబైన ౯ శైవధర్మ
మలఘుమతి నాచరింపంగ ౯ వలయుమొదల. ౧౮౨

తా. మోక్షము శివయోగమునసేగాని నితరకర్మలవలన జేకూరదు. కానసర్వధర్మ ములలో నుత్తమమగు శైవధర్మము నాశ్రయించవలెను

క. ధర్మాతి శయమున నస
త్కర్మము సంక్షీణమగు వి ౯ గత కిల్బిషతం
బేర్మిమయి నున్న నరునకు
నిర్మలశివయోగ మహిమ ౯ నిజముగఁ గల్గున్. ౧౮౩

తా. శివధర్మము లాచరించినగాని, పాపములు నశింపవు. తదనంతరము గాని మాన వునికి శివయోగమహిమ బుద్ధికి గోచరింపదు.

## —* గురు శిష్య సంవాదము. *—

వ. మఱినజ్ఞాన నాశనకారణంబును శివయోగజ్ఞాన మూలంబును నై

న గురుశిష్య సంవాదంబుగల దదియెట్టిదనిన, నిరంతర శివజ్ఞాన,
శివభక్తి, శివధ్యాన, శివవ్రత శివలింగార్చన, పంచవిధ శివయోగ
పూర్వక చతుర్విధ యోగాభ్యాస పరాయణుండైన గురునాథు
నిదివ్య శ్రీపాద పద్మంబులకుఁ దత్ప్రియ శిష్యుండు సాష్టాంగ దం
డ ప్రణామంబు లాచరించి, ముకుళిత కరకము లుండగుచు, దే
వా! భవత్ప్రసాదంబునఁ గృతార్థుండ నైతి, నిందుకు సందేహంబు
లేదైనను మదీయాభిమత ప్రశ్నంబులకు నుత్తరం బవధరింప వల
యునని, విన్నవించి యిట్లనియె. ౧౮౪

అ అజ్ఞాన నాశనమొనరించి శివయోగజ్ఞానముకలుగఁజేయు గురుశిష్య సంవాద
ముగలదు అట్టిదానిని సాధకుల సులభ బోధకైగ వీంద్రుండిందు వచింపుచున్నాడు.

తా. శివజ్ఞానము శివభక్తి - శివధ్యానము - శివవ్రతము - శివలింగార్చనము - అను
పంచవిధములయిన శివయోగముచేఁ బ్రకాశించుచు, మంత్ర - లయ - హఠ - రాజయోగ
ములను నాల్గుతెరంగులగు యోగంబులభ్యసించి విలసిల్లుచున్న గురునాధుని సమీపము
నకు శిష్యుండు చని దోసిలియొగ్గి" మహాత్మా! నేనడు గుప్రశ్నంబులకు సదుత్తరము తీ
యవేడెద. మీకృపాకటాక్ష ప్రసారమాత్రముననే కృతార్థుండనైతినని విన్నవింపదొడగె.

క. ఎయ్యది చేపట్ట వలయు
నెయ్యది విడువంగ వలయు। నెందాఁక మదిన్
నెయ్యమునఁ దత్త్వచింతన
మియ్యఖిలము నాకునాన। తిమ్ము మహాత్మా. ౧౮౫

తా. గురువరా! ఏదివదలవలయును! ఏదిస్వీకరింపవలయును? తత్త్వవిచారమెంతవ
రకు చేయవలయును? ఇదియంతయునాకు నానతీయుము.

వ. అనుటయు గురునాథుండు శిష్యున కిట్లనియె. ౧౮౬

అ. గురువిటుల శిష్యునికిఁజెప్పఁదొడంగెను.

క. పిండాండ మాది మఱి బ్ర
హ్మాండము సర్వంబు దెలియు। మటజీవాత్మం
డుండు నెలవు గనుఁగొని త

త్పిండాండ మనంగనున్న । ప్రియముడుగఁగనౌ. ౧౮౭

తా. పిండాండము మొదలు బ్రహ్మాండమువరకుగల సర్వపదార్థములు విచారించిన వుండుచోటును దెలిసికొని పిండాండము నందలి ప్రేమనువిడువ వలయును.

క. పరమాత్మా లోకనత
త్పరుఁడ వగుచు విడువుమంతఁ । దజ్జీవాత్మం
బరమాత్మ లీనతాసు
స్థిరుఁడవైన లేదొకింత । చింతయునరయన్. ౧౮౮

తా. నీవుపరమాత్మాలోక నపరాయణుఁడవై తన్మయత్వంబునొంది జీవాత్మని వదులుము. పరమాత్మయందు లీనమైనమనస్సు గలనీకిక య్యేవిచారము తోఁచనితేదు.

—* గురుశిష్య సోదర చర్యాజ్ఞాన విచారము. *—

వ. అనిన శిష్యుం డిట్లనియె. ౧౮౯

తా. అంత శిష్యుఁడిటులఁబల్కె.

సీ. ఎట్టివాఁడు గురుండుఁ నెట్టిరంబుగ శిష్యు
లెవ్వరు సోదరులెట్టివారు
సంస్తుతింపఁ గఁదగుఁ చర్యయెట్టిది పర
మజ్ఞానమెట్టిదిఁ మనమలరఁగ
నానతీ వలయుఁ దఁ త్త్వార్థంబు లును గాఁగ
ననుటయు నతనికిఁ ట్లనియెగురుఁడు
ఎవ్వరియందు నూహింపంగఁ దనకంటె
ఘనతరంబగు ప్రజ్ఞఁ గలిగియుండు
తే. గీ. వారలందఱు గురువులుఁ వంద్యులెపుడు
జ్ఞానమునఁ దనకంటెనుఁ హీనులైన
వారలెల్లను శిష్యులుఁ వరసహోద
రులుసమాన విద్యాకలితులుజగమున. ౧౯౦

తా. మహాత్మా! గురువనఁగా నెటువంటివాఁడు. శిష్యులెట్టివారు? సోదరులనఁగ

లెట్టివారు? చర్యయెట్టిది? ఉత్తమజ్ఞానమెట్టిది? తత్త్వార్థమేమి? వివరింపుమని వినయముగాఁ జెప్పుమన్న గురువు— అతనితో శిష్యా! తనకంటె పెద్దవాఁ ప్రజ్ఞాలవారలందఱును గురువులు. వారందరు వందనీయులు. తనకంటె జ్ఞానహీనులగువారందఱు శిష్యులు. సమాన విద్యావంతులు సోదరులుసుమా?

క. ప్రకృతి వరనిష్ఠ యెయ్యది
ప్రకటంబుగ నదియచర్య బ్రహ్మమయంబీ
సకలంబును ననియు దెలియుట
యకలంకజ్ఞానమదియ యగుఁదథ్యము గాఁగ. ౧౯౧

తా. శ్రేష్ఠమగు నిష్ఠయే చర్యయనఁబడు. ఈసర్వము శివుండని తెలియుటయే జ్ఞానంబగు.

—* ఇతరుల కొనర్చుహితా హితకర్మఫల విచారము .*—

వ. అనఁపుడు శిష్యుఁడు. ౧౯౨

క. ఇతరులకు నరుఁడు హితా
హితములు గావించి యాతఁడేలా పొందుఁగా
వితతంబుగఁ సుఖదుఃఖ
ఫలితతుల నిహ మందునైనఁ బరమున నైనన్. ౧౯౩

తా. అంతశిష్యుండు గురువునిట్లాడి గురూత్తమా! మానవు లితరులకుఁజేయును పకారాపకారములకు ఫలంబుల పొందుదురా?

తే. గీ. అనినఁగురు నవ్వుఁడిట్లను నన్యులకును
నహితమైన హితంబైన నాచరించి
నట్టికర్మఫలము మీఁద నైన నిపుడ
నైన భోక్తవ్య మగుసంశయంబు లేదు. ౧౯౪

తా. అంతగురువు "శిష్యా! నీకిసందియమేల? ఇతరులకొనర్చిన హితాహిత కర్మ ఫలమును వెంటనేగాని, తరువాతగాని, యనుభవింప వలయును. తప్పదు.

సీ. ఒక్కసూత్రంబునఁ బెక్కుమాణిక్యంబు
లున్న చందంబున నుండునొక్క
యాత్మయందు చరంబులైన దేహంబులు
నచరంబులైన దేహంబులట్లు
కావున నద్వైత కారణంబుననట్టి
కర్మఫలంబు నిక్కంబుగాఁగ
బురుషుఁ డనుభవించుఁ బరమాత్మయందు జీ
వాత్మ పొందఁక నైక్యంబుఁ బొంద
తే. గీ. కుండునందాఁక నొకటిపో నొక్కతనువుఁ
బొందితా శుభాశుభకర్మ భోక్తయగును
బహువిధములగు సంసార బంధములను
జిక్కువడు మోక్షమార్గంబుఁ జెందలేక. ౧౯౫

తా. ఒకహారమునన నేక మాణిక్యము లుండినటుల ఒకపర మాత్మయందే చరాచర దేహంబులన్నియుఁ బ్రకాశించు చుండును. సచ్చిదానంద రూపుండగు పరమాత్మ యందు జీవుఁ డైక్యంబుచెందు నంతవరకు నొకతనువును వదలి మరొకతనువు ను గ్రహించుచు శుభాశుభకర్మంబుల ననుభ వించుచు సంసారబంధమునబడి మోక్షము బొందలేడు.

## —* యోగ ప్రాశస్త్యము. *—

క. అటుగాన దేహము క్షితిఁ
బటుయోగజ్ఞానివగుచుఁ బరమాత్మునిఁ బ్రా
కట జీవాత్మకు నైక్యము
ఘటియింపఁగఁ జేయుమనఘ కడుశీఘ్రముగన్. ౧౯౬

తా. కావున శివయోగ మభ్యసించి జీవాత్మైక్యముచే కృతార్థులవుము.

తే. గీ. గణనలేని మహాపాతకములు చేసి
వివిధ భూతావళులఁ జంపి విశ్వమెల్ల
దగ్ధముగఁ జేసి పొంచెడు తత్ఫలంబు
నుత్తమజ్ఞాన బలమునఁ యోగివడయు. ౧౯౭

తా. లెక్కలేని మహాపాపంబు లాచరించి యనేక జంతువుల జంపి యాగాదుల వలన పొందెడి మహాఫలము నుత్తమ జ్ఞానమున నొగిపొందును.

శా. యోగజ్ఞానముకంటెఁ బుణ్యము ఫలం బొండేమియుం లేదొగిన్
యోగజ్ఞానము కంటె నన్యంబగు మోక్షోపాయముం లేదిలన్
యోగజ్ఞానముకంటె నిశ్చలసుఖం బొండేమియుంగల్గదీ
యోగజ్ఞానుల కంటెఁ బూజ్యులును లేరుద్యద్గతిం జూడఁగాన్.

తా. యోగజ్ఞానముకన్న మిన్నయగు నొక పుణ్యంబుగాని మోక్షోపాయము గాని శాశ్వతానందము గాని లేదు. శివయోగజ్ఞానులకంటెఁ బూజ్యులును జగంబున మరొకరు లేరు.

క. ఇదిసత్యం బిదిసత్యం
బిదిపరమ రహస్య మితర మెల్లగ్రమమునన్
వదలుము యోగజ్ఞానము
పదిలంబుగ నాత్మనిలిపి బ్రతుకుము వత్సా. ౧౯౯

తా. కుమారా! ఇదిపరమ రహస్యము. ఇదియే సత్యము. దీనినీవు నభ్యసించుము. ఇతరంబు పరిత్యజించుము.

క. భువిఁ జెప్పెడు మాటలేటికి
శివలింగమునందె నిజముఁ జెప్పెద వినుమా!
శివయోగాన్యక్రియ సు
ర్భువ వనేవర్తి నియె మాటలె పరమార్థముగాన్. ౨౦౦

తా. నిజముగా నీశివలింగమునందే చేయునది ప్రమాణపూర్వకముగాఁ జెప్పుచుంటి. ఇంతకన్న పరమార్థ సాధకమగు నదియొకటి లేదు.

చ. ఇదిబహుశాస్త్ర జాలముల నెన్నినసార పదార్థమింతయున్
విదితముగాఁగఁ జెప్పితిమి విస్తృక దీనికి నెంచ నెక్కుడై
నదియొక యుంత యుంగలుగదైనను నీమదిలోన నిష్ఠయై
య్యదియటఁ జెప్ప మన్నతరిఁ బోకుము మూర్తికి భక్తిఁ జిట్టమున్.

తా. ఇదియనేక శాస్త్రముల సారాంశము. దీనికంటె నెక్కుడైనది మరొకటు

లేను. నీమనస్సు లోనిష్టమేది యోచింపుమన శిష్యుండిట్లనియె.

క. జీవాత్మునిఁ జూడ గనరా
దావలఁ బరమాత్మఁ గానఁ నలవియె చక్షు
ర్భావముల కగోచరమగుఁ
గావునఁ దద్యోగ మెట్లు గలుగఁగ నేర్చున్. ౨౦౨

తా. మహాత్మా! గురువరా! జీవాత్మనే చూచుటకు శక్తిలేని నేను, చక్షుర్లకుఁ గాని, మనస్సునకుఁ గాని, యగోచరుఁడగు పరమాత్మనెట్లుగాంచుదును ఆవిషయమును, తెలిపినన్ను సంసార బంధమునుండి తొలగింపు మన్న గురుండిట్లనియె.

క. అనుటయు గురుఁడిట్లను శి
ష్యుని తోడన్ శ్రవణ మననఁ శుద్ధ నిదిధ్యా
సనములు మూఁడును దగుసా
ధనములగున్ సాధ్యమునకుఁ దత్త్వజ్ఞునకున్. ౨౦౩

తా. శిష్యా! మంచిప్రశ్న నడిగితివి. ఆపరమాత్మను దెలిసికొనుటకు శ్రవణ మనన నిదిధ్యాసలని మూఁడుసాధనములు గలవు.

క. శ్రవణంబున మననమ్మగు
ద్వివిధంబునఁ గల్గుమతినిఁ దిధ్యాసనమీ
త్రివిధంబు నాత్మదర్శన
మప్పుటకు హేతువని చెప్పిరార్యులు జగతిన్. ౨౦౪

తా. నిరంతరము పరమేశ్వరుఁ డిట్టివాఁడని వినుటచేత మననము గలుగును. ఈ రెంటిచేతనిది ధ్యాసము చేకూరును. అందువలన నాత్మగన్పించును.

వ. అది యెట్లనిన. ౨౦౫

తా. అదియెటు లనఁగ.

చ. శ్రవణము వేదవాక్యములఁ సమ్మతి విన్కి-తదర్థశాస్త్రసం
భవపటు యుక్తులామననఁ భావము రెంటఁ నెఱింగి ధ్యేయవ
స్తువును గురూక్త మార్గమునఁ సుస్థిరఁ జింతనచేత ధ్యానమీ
త్రివిధమునన్ నిరూఢుఁడగుఁ ధీరుఁడు గాంచు శివస్వరూపమున్

తా. శ్రవణమన వేదవచనములఁ బ్రియముతో వినుట. మననమన- వేదశాస్త్రార్థములఁ బలుమారు తలంచుట. నిదిధ్యాసమన శ్రవణ మననంబులచే నెఱిఁగిన ధ్యేయవస్తువును గురువు చెప్పిన చొప్పున ధ్యానము చేయుట. ఈమూడిటి యందును కార్యసిద్ధిపొందినవాఁడు శివస్వరూపమును గాంచును.

వ. అదియునుం గాక. ౨౦౭

తా. మఱియు,

తే. గీ. సిద్ధ రసవశమున నినుమ్ము శీఘ్రమున సు
వర్ణమగు భాతి సద్గురుని వశతఁ దన్నుఁ
దానకనుఁ గొని యాత్ముండు తన్మయమును
బొందుఁ గడువేగ మునమునన్ ద్భుతము గాఁగ. ౨౦౮

తా. పరుసవేది వలన యినుము బంగారమగునట్టుల గురువుపదేశించిన విధంబున దన్ను దాను దెలిసికొని జీవుండు పరశివస్వరూపంబు నొందును.

క. క్రమమున బహుకర్మపరి
భ్రమహేతువులైనగురులు పరఁగఁ దఱుచు లో
కమునం బునరావృత్తి ప
దమునకుఁ గారణము గారు తలపో యంగన్. ౨౦౯

తా. కర్మమార్గము బోధించు గురువులు లోకంబున ననేకులుగలరు. వారుపున రావృత్తికిఁ గారణ భూతులు. అనఁగాఁ గర్మల నాచరించిన వెంటనే తత్ఫలములను స్వర్గలోకమునఁ బొంది పుణ్యక్షీణము కాఁగానే తిర్గి లోకంబున జన్మించుదురని భావము.

ఉ. వారక మోక్షకాంక్ష గలవారికి వారలతోడి దేటికిన్
ధారుణి నాత్మ యందశివ దర్శన నిర్మల బుద్ధిమైనసా
ధారణ కారణాం బయిన ధన్యుఁడు గల్గిన యానతండు వి
స్తారత తత్త్వ భావుఁడగు సద్గురు నాథుఁడు వంద్యుఁ డెల్లెడన్.

తా. మోక్షమును గోరువారికి వారలతోఁ బనియేమి. ఆత్మయందే శివదర్శనము గలుఁగజేసిన మహానుభావుఁ డెల్లకాలము వందనీయుఁడు.

—— * మాయా విచారము * ——

సీ. అని గురుం డానతిచ్చిన శిష్యుఁ డిట్లను
మాయ యే గతి నుండును మహిత చరిత
తద్విలక్షణమైన తత్త్వ మెయ్యది తద
తీత మెయ్యది యైన దేటపడఁగఁ
గలదే? సదియును గదియింప వలయు నా
కనుటయు శ్రీగురుఁ డతనితోడ
ననియె నీ యడిగిన యర్థంబు గంభీర
మెంతయు లెస్స ము న్నిట్టి సుమహాత్ము
తే. గీ. లైన సుజ్ఞాన నిరతులు చేవనూన
భంగిఁ జెప్పఁగఁ బడియెం దస్త్వరత వినుము
ధరణి మొదలైన పంచ భూతములు మాయ
తద్విలక్షణ జీవాత్మ తత్త్వ మొసరు. ౨౧౧

తా. అనివచింపగా శిష్యుండు గురువును జూచి మహానుభావా! మాయ యనఁగా నెట్టిది? ఏవిధముగా నుండును? దానినతిక్రమించిన తత్త్వ మేది? దానికంటె విలక్షణమైనది యేది? అట్టి దేది గలిగియుండిన నాకు సెలవింపుమనఁగ- గురువు శిష్యుని ప్రేమతో జూచి, వత్సా నీవడిగిన ప్రశ్న మెంతయు బాగుగనున్నది. అది యతి గంభీరార్థము గలది. ముందు మహాత్ములైన సుజ్ఞానులు దానిని జెప్పియుండిరి. అది వచించెద. శ్రద్ధాసహుఁడవై యాలింపుము. పృథివి. ఉదకము- తేజస్సు వాయువు- ఆకాశమును పంచభూతములును మాయ యనఁబడును. దీనికంటె వేరైనది జీవాత్మతత్త్వమని తెలియవలయును.

తే. గీ. అదిమనశ్శక్తి యంద్రు తత్త్వార్థ విదులు
తన్మనోంతము లైన తత్త్వంబు లంటఁ
గడచి యింద్రియాతీతుఁడై గరిమ మెరసి
పరమ పదుఁడై వెలుంగును బరశివుండు. ౨౧౨

తా. తత్త్వవేత్తలు దానిని మనశ్శక్తి యనిచెప్పుదురు. మనస్తత్త్వము చివర గలయా నానాతత్త్వములను విడిచి యింద్రియాతీతుఁడై వెలింగెడి వాఁడు పరశివుండు.

క. స్వానుభవంబున నపరిమి

తానందము గ్రంథికౌనగ నాపన మూర్తిన్
డైన శివునెఱుఁగుచుఁ ద
ల్లీనుఁడ నైసుఖి నగున్ లీలఁ గుమారా. ౧౧౩

తా. స్వానుభవంబున నానందరూపుండగు పరశివుని నెఱింగి యాతనియందు లీనమైన మనస్సుగలిగి శాశ్వత సుఖంబును బొందుము.

—: శివాశివాది నామంబులుగల వస్తు విచారము:—

వ. అనిననిని శిష్యుండు దేవా! శివంబును, నశివంబునగు-శివాశివ పరమాత్మకంబును- కేవలంబును సహజానందంబు ననఁదగు నవియెవ్వి,యవ్విధంబు నాన తీవలయునని విన్నవించిన తనీయాంచిత ప్రజ్ఞా విశేషంబునకు నెంతయు సంతసించి గురునాథుం డిట్లనియె.

తా. అంతశిష్యుండు" గురువరా! శివము- అశివము శివాశివ పరమాత్మ కేవలము సహజానందముసను నవియెవ్వి! తెలియఁజెప్పుమన గురుండిట్లనియె.

క. శక్తి మహా మాయయగుఁ
శక్తిపతి శివుఁడు వెలుఁగు సచరాచరము
వ్యక్త జగజ్జాలము శివ
శక్తి మయంబయ్యె ననఘ సకలము నరయన్. ౧౧౪

తా. శిష్యా! శక్తియే మహామాయ. శక్తిపై వెలింగెడి వాఁడు శివుండు. ఈచరాచర ప్రపంచమంతయు శివశక్త్యాత్మకము.

క. వినుపుణ్యంబును స్వర్గం
బును మోక్షంబును శివుండు శుభము సుఖం
బును నిష్ప్రపంచ కంబును
ననునీయేడును శివాహ్వయములై యుండున్. ౧౧౫

తా. పుణ్యము- స్వర్గము- మోక్షము- శివుండు. శుభము- సుఖము- నిష్ప్రపంచము- ఈయేడును శివుని పేరులవి.

క. మునుకొని దురితము దుర్గతి
యునుమఱి బంధంబు శక్తి యునున శుభముఁగ

